





The Andhra Patrika, Madras. } Regd. No M 1118 Vol. 36 No. 251 WEDNESDAY 14th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K.NageswaraRac


# "కాశ్మీర్ సమస్యాపరిష్కారానికి విశేషాధికారాలతో ఒకవ్యక్తిని నియమించడమే ఉత్తమ మార్గం"

## తమ అశక్తతను ప్రకటిస్తూ భద్రతా మండలికి కమిషన్ నివేదిక

### ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వాల వాదనల సమీక్ష

### యుద్ధవిరమణ విషయంలో ప్రత్యేక పరిష్కర్త అవసరమనికూడా సూచన

లేక్‌సక్సెస్, డిసెంబరు 12: కాశ్మీరు సమస్య పరిష్కరించడానికి ఏడాదిపాటు కృషిచేసిన ఐక్యరాజ్య కాశ్మీరు కమిషనువారు తమ అశక్తతను వెల్లడిస్తూ భద్రతామండలికి 80 పేజీల నివేదిక సమర్పించారు.

ఇండియా పాకిస్తానులమధ్య ప్రతిష్టంభన ఏర్పడటానికి వారు మూడు కారణాలు పేర్కొన్నారు: (1) అజాద్ కాశ్మీరు సేనల భవితవ్యం; (2) కాశ్మీరునుంచి ఏకకాలమందే భారతీయ సైన్యాలనూ, పాకిస్తాను సైన్యాలనూ ఉపసంహరించడం; (3) పాకిస్తాను సరిహద్దున ఉత్తర ప్రాంతంలోగల కొండప్రాంతాల పరిపాలన.

కమిషనువారు ఉభయపక్షాలతోనూ అనేకవిధాల సంప్రతింపులు జరిపి, పై అంశాలపై వారికి సమాధానం కుదరదనే నిర్ణయానికి వచ్చారు. తమ అనుభవాన్నిబట్టి కాశ్మీరు కమిషనువారు, ఉభయపక్షాలమధ్య రాజీ జరపడానికి ఒక వ్యక్తిని నియమించి అతనికి విశేషమైన అధికారాలూ, అవిభక్తమైన బాధ్యతా ఉండేలాగు చేయడం ఉత్తమమార్గమని భద్రతామండలికి శిఫార్సు చేస్తున్నారు.

సంధిపరిష్కారం నిమిత్తమై భద్రతామండలి ఒక పరిష్కర్తను కూడా నియమించదగును.

కాశ్మీరు కమిషనువారు నేడు భద్రతా మండలికి సమర్పించిన నివేదికలో, కాశ్మీరు వ్యవహారాలు చూడడానికి ఇటువంటికమిషను సరిఅయిన సాధనం కాదనీ, ఇండియా పాకిస్తానుల మధ్య అపరిష్కృతంగా నిలచిఉన్న సమస్యలను పరిష్కరించడానికి ఒక వ్యక్తిని నియమించ దగుననీ, ఈ వ్యక్తియొక్క అధికారాలను గురించి భద్రతా మండలివారు ఇండియా పాకిస్తానుల ప్రతినిధులతో సంప్రతించ దగుననీ సూచించారు.

జమ్మూ కాశ్మీరు నిస్సైనికం చేయడం విషయంలో తుది పరిష్కార మార్గం సూచించడానికి మధ్యవర్తికి కొన్ని అధికారాలుండాలి. జమ్మూ కాశ్మీరు నిస్సైనికమైతేగాని జనవాక్య నిర్ధారణకు అనుకూల పరిస్థితు లేర్పడవు.

ఇండియా పాకిస్తానులు యుద్ధ విరమణ షరతులు తూచా తప్పకుండా పాటించబడడానికి తగిన చర్యలు తీసుకొని, కాశ్మీరు సమస్య పరిష్కార మయేవరకు

(4-వ పేజీ చూడుడు)

## నైరృతి చైనా అంతటిపై కమ్యూనిస్టు ఆధిపత్యం

### కమ్యూనిస్టులతో ఇద్దరు జాతీయ ప్రభుత్వ సేనానుల కలయిక

హాంకాంగ్, డిసెంబరు 12: ఈ వేళ జాతీయ చైనా సేనలు రెండు సేనా నాయకులతో సహా కమ్యూనిస్టులతో కలిసిపోయాయని తెలుస్తున్నది. దీనితో నైరృతి చైనాలో జాతీయ చైనా సంరంభం ముగిసినట్లే ఎంచవచ్చును. 6వ సేనకు నాయకుడు జనరల్ లీవీ 26వ సేనకు నాయకుడు జనరల్ యుథెంగ్‌వాన్‌లు ఇద్దరు తమ సేనలతో సహా కమ్యూనిస్టులతో కలిసి పోయి జాతీయ చైనాకు వ్యతిరేకంగా యుద్ధం చేస్తున్నారని తెలుస్తున్నది.

దీనితో యున్నాన్ రాష్ట్రంలో జాతీయ చైనాకు ప్రాబల్యం పూర్తిగా తగ్గిపోయిందనే ఎంచవచ్చును. దీనివల్ల కమ్యూనిస్టులకు బర్మా ఇండోచైనా సరిహద్దులతో సరాసరి సంబంధం కూడా ఏర్పడుతున్నది.

ఈ సేనా నాయకు లిద్దరు తాము కమ్యూనిస్టులతో చేరదలచు కున్న విషయం కుమ్మింగ్ వార్తా పత్రికలో ప్రకటించారట. కుమ్మింగ్ గవర్నరు జనరలు లుహాన్ తాను కమ్యూనిస్టులతో చేరిపోగానే వీరిద్దరినీ నిర్బంధించాడని తెలుస్తున్నది.

ఇంకొక జాతీయ సేనానిని కూడా ఈ గవర్నరు నిర్బంధించాడు గాని, చివరికి ఇతనిని విడుదల చేశాడనీ, ఈ సేనాని హాంకాంగ్ వెళ్ళిపోతున్నాడనీ తెలుస్తున్నది.

సెషూన్ రాష్ట్రంలోని చెంగ్టూ రక్షణ కూడా దుర్బలమై పోతున్నదనీ, దీనికి హూటిసుంగ్‌నన్ తన సేనలను పర్వత ప్రాంతాల వైపు తరలించి వెయ్యడమే కారణమనీ తెలుస్తున్నది. ఈ ప్రాంతాలలోని ప్రజలు తిరగబడతారనే భయంచేత ఈ సేనాని ఈ విధంగా తన సేనలను తరలించి వేశాడని తెలుస్తున్నది. కమ్యూనిస్టు సేనలో హిసి ఇం గ్టిన్ నగరం వైపు పురోగమిస్తున్నవనికూడా తెలుస్తున్నది. ఈనగరం చెంగ్టూకు నైరుతి దిక్కున 15 మైళ్ళ దూరంలో ఉన్నది. ఈ నగరం కమ్యూనిస్టుల వశమైతే జాతీయ సేనలు సికాంగు వైపు పారిపోవడానికి వీలుండదట.

క్వేచౌ రాష్ట్రం తాత్కాలిక గవర్నరు హోచియావో ఇస్సింగ్ కూడా కమ్యూనిస్టులతో కలిసిపోయాడనీ, ఇతడు తన అధీనంలోఉన్న జాతీయ సేనలకు యుద్ధం చెయ్యవద్దని ఆజ్ఞాపించాడనీ తెలుస్తున్నది.

జాతీయ చైనీయులకు క్వేచౌ రాష్ట్రంలో అట్టే బలంలేదనీ, అక్కడ జాతీయ చైనాకు 20 వేల సైన్యంమాత్రమే ఉన్నదనీ, అందుచేత క్వేచౌ తిరిగిపోవడంవల్ల జాతీయ చైనాకు అంతగా నష్టంలేదనీ అభిజ్ఞులు అంటున్నారు.

చైనా భూభాగంలో ఇంక జాతీయ చైనాకు మిగిలినది ఒక్క సికాంగు రాష్ట్రమేనట. ఇది అయినా కొండ ప్రదేశమనీ, ఇందులో జనాభా చాలా తక్కువనీ తెలుస్తున్నది. అయితే ఇదికూడా త్వరలో కమ్యూనిస్టులతో కలిసిపోగలదనీ తెలుస్తున్నది.

సికాంగ్ గవర్నరు లియూవెన్‌హ్వీకి కమ్యూనిస్టులంటే ఇష్టంలేదట. కాని కమ్యూనిస్టులతో కలిసిపోవడంవల్లనే తన భవిష్యత్తు భద్రంగా ఉండగలదని ఇతడు భావిస్తున్నాడట. ఇతనికి చాంగ్ కేషేక్ కు పడదనీ, ఇతడు జాతీయ చైనా నాయకులు సికాంగ్‌లో కాలూనడానికి ప్రతిఘటించాడనీ తెలుస్తున్నది. దీనివల్ల జాతీయ చైనా నాయకులకు సికాంగ్ పర్వతాలలో ఉండి గెరిల్లాయుద్ధం నడిపించడానికికూడా వీలుండదు. సికాంగ్ చ

కమ్యూనిస్టుల వశమైపోవడంవల్ల వారు టిబెట్‌లోకికూడా సులభంగా ప్రవేశించడానికి వీలవుతుంది. తద్వారా వారు ఇండియా సరిహద్దులకుకూడా రాగలుగుతారని తెలుస్తున్నది.

### చైనా-వీట్నాం సరిహద్దుల్లో కొమింటాంగ్ సైన్యం

హానోయ్, డిసెంబర్ 12: ఇండోచైనా సరిహద్దు పట్టణమైన లాంగ్సన్‌కి కొన్ని మైళ్లు ఉత్తరంగా 15 వేల కొమింటాంగ్ సైన్యం సమీకరించబడ్డది. తాము ఇండోచైనాలో తలదాచుకోదలిస్తే వీరేం చేస్తారని వారు స్థానిక ఫ్రెంచి అధికారులను ప్రశ్నించగా, నిరాయుధం చేయబడి నిర్బంధించబడతారని వారు జవాబిచ్చారనీ తెలుస్తున్నది.

యూనాన్ - వీట్నాం సరిహద్దుల పరిస్థితి శాంతంగానే ఉన్నట్లు తెలుస్తున్నది.

### మలయాపోలీసుల మరణం

సింగపూర్, డిసెంబరు 12: మలయా పోలీసుశాఖలోని ఒక ఆటవిక దళంలో పనిచేస్తున్న 17 మంది పోలీసులను దౌర్జన్యవాదులు చంపి వేశారు. వీరిలో ఒకయూరపియన్ అసిస్టెంటు సూపరిండెంటుకూడా వున్నారు. మరోతొమ్మండు గురికి బలమైన గాయాలు తగిలినై. దౌర్జన్యవాదుల గెరిల్లాలు ఈ పోలీసువారు ప్రయాణం చేస్తున్న మూడు మోటారు వానులకు నిప్పుపెట్టి కాల్చివేశారు. ఈ సంఘటన సెగ్రీ - సెంబలాన్ ప్రాంతంలో జరిగింది.

## సంస్థాన కాంగ్రెసులో ఏర్పడ్డ సామరస్యాన్ని సుస్థిరం చేయడానికి తీవ్రప్రయత్నాలు

హైదరాబాదు, డిసెంబరు 12: హైదరాబాదు సంస్థాన కాంగ్రెసుకు దిగంబరరావు బిందు గారిని ఏకగ్రీవంగా ఎన్నుకోవటంతో, ఉభయ పక్షాలమధ్య ఏర్పడిన సమరసభావం అక్కడేనిలిచిపోకుండా రాష్ట్ర కాంగ్రెసు ఎన్నికలకు కూడా వ్యాపించవలెననే భావాన్ని సంస్థాన కాంగ్రెసునాయకు లొకరు నేడు వెలిబుచ్చారు.

మహారాష్ట్ర కాంగ్రెసు సంఘమునకు బాబాసాహెబ్ పరంజ్పేగారిని, ఆంధ్ర 'బి' కాంగ్రెసుసంఘమునకు వినాయకరావు విద్యాలంకార్ గారిని పోటీలేకుండా అధ్యక్షులుగా ఎన్నుకోవటంతో ఈ రెండు సంఘాలు చక్కని ఉదాహరణను చూపినవి.

దిగంబరరావు బిందూ మిగతా రెండు రాష్ట్ర కాంగ్రెసు సంఘాలకు పోటీలేకుండా అధ్యక్షులఎన్నికలు జరుపవలెనని గట్టిప్రయత్నములు చేస్తున్నట్లు సంస్థాన కాంగ్రెస్ విభేదాలన్నీ సఖ్యతా పూర్వకంగా పరిష్కారం కావాలని డా॥ పట్టాభి సీతారామయ్యగారన్నమాటనే తిరిగి ఉద్ఘాటిస్తున్నట్లు తెలిసినది కర్నాటక రాష్ట్ర కాంగ్రెసుకు, ఆంధ్ర 'ఏ' కాంగ్రెసుకు, ఇంకా ఎన్నికలు జరుగవలసివున్నవి. కర్నాటక కాంగ్రెసు అధ్యక్షపదవికి నలుగురు అభ్యర్థులు నామినేషన్లు దాఖలుచేశారు వీరు జి రామాచారి, వినూపాక్షప్ప, మల్లప్ప, శ్రీనివాసరావు అభిషేకర్. ఆంధ్ర 'ఏ' కాంగ్రెసుఅధ్యక్షపదవికికూడా నలుగురు అభ్యర్థులున్నారు. వీరు జమలాపురం కేశవరావు, కోదాటి నారాయణరావు, (స్వామీజీ పక్షమునకు చెందినవారు) వెంకటరంగారెడ్డి, భాస్కరరావు (రెండోపక్షానికి చెందినవారు) గార్లు. పోటీలోకుండా ఈరెండు ఎన్నికలు జరిపించాలని తీవ్రప్రయత్నాలు జరుగుతున్నవి. డిసెంబరు 17 న సంస్థాన కాంగ్రెసుకార్యవర్గంసమావేశమై హైదరాబాదు రాజ్యాంగ పరిషత్తుకు అభ్యర్థులను నియమించటానికై ఒక పార్లమెంటరీబోర్డును నెలకొల్పే విషయమును, సంస్థాన కాంగ్రెసు వార్షిక సమావేశపు తేదీలను నిర్ణయించటానికిన్నీ చర్చలు జరుపుతుంది. స్వ. వి.

## కొత్త నాణెములు

న్యూఢిల్లీ, డిసెంబరు 12:—కొత్తనాణేల మీద వేయటానికి 230 నమూనాలు ప్రతిపాదించబడినవనీ, చివరకు ఈ క్రింది విధంగా ముద్రించటానికి వాణిజ్య మంత్రి నియోగిగారు నేడు పార్లమెంటులో వెల్లడించారు.

అన్ని నాణేలకూ ఒక వైపున అశోక స్తంభ శిఖరం — సింహాలతో — ముద్రించబడుతుంది. రెండో వైపున, అంటే నాణెపు విలువ వ్రాసి ఉండే వైపున నమూనాలు మారుతవి. రూపాయి నాణెం మీదా అర్థరూపాయి, పావలా నాణాలమీదా ధాన్యపుకంకులు, ముద్రించబడతవి. బేడ, అణా, అర్ధణాలమీద అశోక స్తంభం మీదఉన్న వృషభ విగ్రహాన్ని ముద్రస్తారు. కానులమీద అశోక స్తంభంమీది అశ్వ విగ్రహాన్ని ముద్రిస్తారు.

ఈ కొత్త నాణేలను ఆగస్టు 15 న చెలామణీలో ప్రవేశ పెడతారు.

## భారత ప్రభుత్వ సాయుధ రిజర్వు పోలీసు శాఖ

### పార్లమెంటులో బిల్లు ప్రతిపాదన

న్యూఢిల్లీ, డిసెంబర్ 12: కేంద్రప్రభుత్వంక్రింద సాయుధ రిజర్వు పోలీసు బలగాన్ని స్థాపించే నిమిత్తం భారత హోం మంత్రి సర్దార్ పటేల్ నేడు పార్లమెంటులో ఒక బిల్లును ప్రతిపాదించారు.

1939 లో రాజప్రతినిధిచేత స్థాపించబడ్డ ప్రత్యేక రిజర్వు పోలీసు బలాన్ని కొత్త రాజ్యాంగంక్రింద కూడా నిర్వహించటానికి ఈ బిల్లు ప్రభుత్వానికి అధికారం యిస్తుంది. అశాంతిక సమయాల్లో సంస్థానాల్లో శాంతి భద్రతలను రక్షించే నిమిత్తం ఈ బలగం ఏర్పరచబడ్డది. 1939 చట్టం 1949 ఆగస్టులో రద్దయినప్పటికీ బలగం మాత్రం అట్లాగే ఉంచబడ్డది.

#### పన్నుల పరిమితి చట్టసవరణ

పన్నుల పరిమితి చట్టా (1941) న్ని సవరించి, సంయుక్తరాష్ట్రాల్లో ఆస్తుల మీద ఎక్కువరేట్లతో పన్ను విధించటానికి అనుమతించే నిమిత్తం ఆర్థిక మంత్రి తరఫున పార్లమెంటరీ వ్యవహారాలమంత్రి సత్యనారాయణ్ సింహా ఈ వేళ మరొక బిల్లును ప్రతిపాదించాడు.

## జొన్నల రేషనింగ్, కంట్రోలు ఎత్తివేత

### మంత్రి రాఘవిక్టోరియా ప్రకటన

కర్నూలు, డిసెంబరు 13: కర్నూలు వంటి జిల్లాలలో జొన్నలు అధికంగా పండుతున్నవి కనుక ఈ జిల్లాలలో జొన్నల రేషనింగును, కంట్రోలును ఎత్తివేయవలెనని ప్రభుత్వం నిశ్చయించినట్లు రాష్ట్ర ఆహార శాఖామంత్రి రాఘవిక్టోరియా గారు నేడు కర్నూలులో ఆహార శాఖా సమావేశంలో తెలియజేశారు. రేషన్ తొలగింపు ఉత్తర్వులు తాను మద్రాసుకు వెళ్ళగానే జారీఅవుతాయనీ, జొన్నల మిగులు జిల్లాలనుండి జొన్నల రవాణాను స్వేచ్ఛగా జరగనిచ్చే విషయమును ప్రభుత్వం ఆలోచిస్తున్నదనీకూడా ఆయన తెలిపాడు. (స్వ. వి.)

## జనవరి 26 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్రం నిర్మాణం కావాలని విభజన సంఘ నిర్ణయం

చెన్నపట్నం, డిసెంబరు 13: జనవరి 26 వ తేదీకే ఆంధ్రరాష్ట్రం తప్పక ఏర్పడవలెనని చెన్నరాష్ట్ర విభజనసంఘంవారు తీర్మానించారని రూఢిగా తెలియుచున్నది. డిసెంబరు ఆఖరుకే పని పూర్తిచేయవలెననిగూడా నిర్ణయించిరి. రాజధాని విషయమై ఆంధ్రులు మరోరాజధాని చూసుకొనువరకు చెన్నపట్నంలో ఉండనివ్వవలెననియు, శాసనసభ సమావేశము కావలెనన్న బయట జరుపుకొందుమని తమిళ నాయకులతో సంప్రదింపుల అనంతరము విభజనసంఘములోని ఇద్దరు ఆంధ్ర సభ్యులు సూచించినటుల తెలియుచున్నది.

డిసెంబరు 21 వ తేదీకి రాజధానీనగర విషయం తేల్చుటకు నిర్ణయింపబడెననియు తెలియుచున్నది.

ఆంధ్ర తమిళ రాష్ట్రములకు కౌన్సిలు అవసరము లేదనియు, ఇప్పుడున్న కౌన్సిలుసభ్యులను ఆంధ్ర తమిళ శాసనసభలలో కలిపివేయవలెనని విభజనసంఘం వారు సూచించిరని తెలియుచున్నది.

21 వ తేదీ నాటికి ఆస్తి అప్పులు, సిబ్బందిని గూర్చి అధికార సంఘముల నిర్ణయములు అందగలవు. నేటి మధ్యాహ్నం ఆర్థికసంఘ సమావేశము జరుగుచున్నది.

మద్రాసు ప్రభుత్వంవారు పంపిన ప్రశ్నావళికి నేటి సాయంత్రంలో పలు సమాధానము పంపవలెననియు గవర్నరు జనరల్ రాక సందర్భమున ఏర్పాట్లకన్న ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమాచార సేకరణ అతి జరూరు విషయముగా అధికారులు పాటించి విషయ సేకరణసాగించుచున్నారని తెలియుచున్నది.

జనవరి 26 వ తేదీకి ఆంధ్రరాష్ట్రము రావలెనన్నది విభజన సంఘం ఆశయమనియు, ఈ నెలాఖరుకు పని ముగింప తీర్మానించితిమనియు, హైకోర్టు ఆంధ్రప్రాంతమునకు అధికారము లేనిచోటునుండి పని చేయ వీలులేదనియు మంత్రి మాధవ మీనన్‌గారు తెలిపిరి.

### సమాచార సేకరణ

మదరాసు, డిశంబరు 13: జనవరి 25 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరగుటకు కొన్ని చర్యలు తీసుకొనుటకు గాను ప్రభుత్వమువారి వివిధశాఖలలో తగు గణాలలో ఆంధ్ర ఉద్యోగస్తులు, ఆంధ్రేతర ఉద్యోగస్తులు ఎంతెంతమంది వున్నారో వెంటనే తెలియ జేయవలసినదిగా ప్రభుత్వము జారీచేసిన సర్క్యులరు శాఖాధిపతులకు అందినట్లున్నూ, వారు ఈ సమాచారము తక్షణము సేకరించుచున్నట్లునూ ఈ 15వ తేదీ నాటికి ప్రభుత్వమువారికిఅందజేయ సున్నట్లు కూడ తెలియుచున్నది. ఈ సందర్భములో విభజనశాఖలలో ఎంతవరకు ఖర్చును తగ్గించగలరో కూడా తెలుపవలసినదిగా ప్రభుత్వము కోరినట్లు తెలియుచున్నది.

## త్వరలో నిజాం కరెన్సీ తొలగింపు

### పార్లమెంటులో సర్దార్ పటేల్ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 12: హైదరాబాదులో చెలామణీ అయ్యే ప్రత్యేక కరెన్సీని తొలగించి భారతీయ కరెన్సీని ప్రవేశపెట్టడానికి శీఘ్రప్రయత్నాలు జరుగుతున్నవనీ, ప్రస్తుతం సంస్థానంలో నిలవలోగాని చెలామణీలోగాని వున్న వుస్మానియా సిక్కానోట్ల మొత్తంవిలువ 68 కోట్ల 77 లక్షల రూ॥ ఉంటుందనీ, ఇదికాక 3 కోట్ల రూ॥ల విలవైన సిక్కారూపాయినోట్లు చెలామణీలో వున్నాయనీ హోంశాఖమంత్రి సర్దార్ పటేల్ నేడు పార్లమెంటు ప్రశ్నలకు జవాబు చెబుతూ అన్నారు.

## పాకిస్తాన్‌లో విమానప్రమాదం

కరాచీ, డిసెంబరు 13: 21 మంది ప్రయాణీకులతోవున్న పాకిస్థాన్ డకోటా విమానం గతరాత్రి కరాచీకి 35 మైళ్ళలో కూలిపోయింది. విమాన ప్రమాదాన్ని దర్యాప్తు చేయడానికి కొంతమంది ప్రముఖులు బయలుదేరి వెళ్లారు.

## హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లు

### వ్యతిరేక ప్రదర్శనాలపై చర్చ

#### అలగురాయ్ తీర్మానం త్రోసివేత

న్యూఢిల్లీ, డిశంబర్ 13: హిందూ ధర్మ క్రోడీకరణ చట్టానికి విరుద్ధంగా నిన్న పార్లమెంటు భవనంముందు జరిగిన ప్రదర్శనాలను గురించి చర్చించటానికి అనుమతించవలసిందిగా అలగురాయ్ శాస్త్రిగారు తెచ్చిన విరామ తీర్మానాన్ని, పార్లమెంటు ఉపాధ్యక్షులు అనంతశయనం అయ్యంగారు త్రోసివేశారు. తీర్మానం నోటీసు సకాలంలో అందలేదన్నారు.

ఆ తీర్మానం పాఠం ఇలావుంది. నిన్నటిదినం ప్రభుత్వ భవనం ముందు జరిగిన ప్రదర్శనాలు చాలా ఆక్షేపణీయంగా వున్నయ్. కాశ్మీర్ ప్రధాని కారును అడ్డగించారు. కాంగ్రెస్ వాదుల తలలమీదవున్న గాంధీ టోపీలు లాక్కొని వాటిని కర్రలచివర తగిలించుకుని వాటిని బహిరంగంగా తగులబెట్టారు. ప్రధానమంత్రినీ, కాంగ్రెసునూ, ప్రభుత్వాన్నీ నానా దుర్భాషలూ మాట్లాడుతూ కేకలు పెట్టారు. బలవంతానదుకాణాలు మూయించారు. బస్సులన్నీ ఆపివేసి వాటిలో బలవంతంగా యెక్కి కూర్చున్నారు. ఇవన్నీ యేవిధంగానూ సమర్ధనీయమైన చర్యలుగా లేవు.

'ఈ ప్రదర్శనాలు జరగటానికి ప్రభుత్వానికి యెంతవరకు బాధ్యతవున్నది అన్నవిషయం ఎలావున్నా, ఈ రకం ప్రవర్తనలమీద తగిన చర్యలు తీసుకోకుండా ప్రభుత్వం ఉపేక్షించింది. ఇందువల్ల కాంగ్రెస్ గౌరవానికీ జాతీయ ప్రభుత్వం గౌరవానికీ కూడా చాలా భంగంజరిగింది.'

## నిజలింగప్పగారి ఢిల్లీ ప్రయాణం వాయిదా

హుబ్లీ, డిశంబర్ 12: కర్నాటక కాంగ్రెస్ అధ్యక్షులు నిజలింగప్ప లోగడ అనుకున్న ప్రకారంగా ఈ వేళ ఢిల్లీకి బయలు దేరటంలేదు. శాసనసభలలోనుంచి కర్నాటకసభ్యులు ఇచ్చిన రాజీనామాలను వీరు స్వయంగా అఖిలభారత కాంగ్రెస్ సంఘానికి అందచేయటానికిగాను ఢిల్లీ వెడదామనుకున్నారు. కాని యీ వేళ వారు బయలుదేరటంలేదు. 18 వ తేదీన వెడతారు. ఈలోగా యీ 25 రాజీనామాలనూ పోస్టుద్వారా అందజేసారు.

## దక్షిణాఫ్రికా పార్లమెంటులో రంగుజాతుల ప్రాతినిధ్య చట్టసవరణ బిల్లు

### ప్రస్తుతానికి ప్రధాని డా॥ మలాన్ విరమణ

ప్రిటోరియా, డిశంబర్ 12: 1936 శాసనం యొక్క చట్టాన్ని అనుసరించి దక్షిణాఫ్రికా ప్రభుత్వంలో కేప్ రాష్ట్రంలోని రంగుజాతులతరఫున మూడుస్థానాలకు ప్రాతినిధ్యం వుంది. అదయినా రంగు జాతుల వోటర్లు యీ ముగ్గుర్నీ తెల్లవాళ్ళనే యెన్నుకుని పంపవలసివుంది. ఈ ప్రాతినిధ్యంకూడా రద్దుచేయాలని మలాన్ ప్రభుత్వం ఈమధ్య నానాతంటాలూ పడ్డది. 1936 చట్టాన్ని సవరించటానికి ప్రయత్నించింది. అయితే ఆ దుష్ప్రయత్నం సాగలేదు. ఎందుచేతనంటే రంగుజాతులవోటింగుకు సంబంధించిన యే శాసనాన్ని సవరించాలన్నా ఉభయశాసన సభలలోనూ మూడింట రెండువంతుల అధికసంఖ్యాక సభ్యత్వం ఆమోదించాలి. ఆఫ్రికన్ పార్టీ నాయకుడు డాక్టర్ హావెన్‌గారు యిందుకు అంగీకరించనికారణంగా ప్రస్తుతానికి మలాన్ ఈ దుష్కార్యాన్ని విరమించుకోవలసివచ్చింది.

# "శ్రీబాగు ఒడంబడికమేరకు విజయవాడలో రాజధాని, రాయలసీమలో న్యాయస్థానము ఏర్పరచుకోవచ్చును"

## పరిపాలనా సంస్థలన్నీ ఏ ఒక్కచోటనో కేంద్రీకృతం కారాదని సి. ఆర్. రెడ్డిగారి హెచ్చరిక

విశాఖపట్నము, డిసెంబరు 12: "మనకు విమర్శక పద్ధతిపై వ్యామోహము ఎక్కువ. రాష్ట్రం ఏర్పడనున్న ఈ సమయములో కొందరు ప్రభుత్వ పరిపాలనా కేంద్రముల గురించి ఆందోళన ప్రారంభించారు. ఇది తగదు. పరిపాలనాసంస్థ లన్నీ ఒకేచోట కేంద్రీకృతం కావడం అంత వాంఛనీయం గాదు. కెనడాలో ప్రభుత్వ కేంద్రం ఒకచోట, విశ్వకళా పరిషత్తు కేంద్రం వేరొకచోట ఉన్నది. సెక్రెటేరియట్ అనే మహావృక్షచ్ఛాయలో విశ్వకళాపరిషత్తు అనే సుకుమారతావి వృద్ధిచెందలేదు. దక్షిణాఫ్రికాలో విద్యాకేంద్రం, పరిపాలనాకేంద్రం, న్యాయస్థానకేంద్రం అన్నీ వేరువేరు చోట్ల ఉన్నవి. మనము ఆ ప్రకారంగానే శ్రీబాగు ఒడంబడిక మేరకు ప్రభుత్వ, శాసనసభా కేంద్రాన్ని విజయవాడలోనూ, న్యాయస్థానము మరికొన్ని కేంద్రములను రాయలసీమలోనూ ఏర్పాటు చేసుకోవచ్చును." అని డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు నేడు ఇచట ఆంధ్రవిశ్వకళాపరిషత్ విద్యార్థు లేర్పాటుచేసిన ఆంధ్రాభ్యుదయ వారోత్సవములను ప్రారంభించుచు ఉద్ఘాటించిరి.

విషయంలో తమిళులకూ మనకూ ఏకాభిప్రాయము కష్టము భాషాప్రయుక్త రాష్ట్రములు కావలెనని 1918 నుంచి వాదించాను. వివేకముతో పోవాలనీ, అపాయములేని ఉపాయముల ద్వారా — ఆంధ్రరాష్ట్రము సిద్ధించాలనీ, నాకోరిక. ఒక్క ఆంధ్రరాష్ట్రము దేశము కాదు. రాష్ట్రములన్నీ దేశమునకు అంగములు కాని దేశములు కావు. భారతమాత అభివృద్ధికి ఈ క్లిష్టసమయములలో, భారతదేశమునకు క్లిష్టసమస్యలు కల్పించకూడదని నాకోరిక. మితిమునకునిరాకి విరోధము కానీ — వైమనస్యము కానీ పెట్టుకొనుట తగదు.

### హరిసర్వోత్తమ రావుగారి ఉపన్యాసం

నిమ్మట శ్రీగాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారు ఉపన్యసిస్తూ ఇలా అన్నారు:

"దేశములో రాజకీయ చైతన్యము కలిగినంతమాత్రమున సంపూర్ణ ప్రయోజనము చేకూరదు. సాంఘిక పరివర్తన, సాంఘిక చైతన్యమూ కలగవలెనని, విజ్ఞాన సముపార్జనచేసి, ప్రాచీన విశ్వాసములను శాస్త్రరీత్యా పరిశీలించి–శాస్త్రమునకు అందని విశ్వాసములనూ, మూఢ నమ్మకములనూ జనబాహుళ్యము వదిలిపెట్టునట్లు చేయవలెను. విజ్ఞాన శాస్త్ర సముపార్జనవల్ల దేశము బాగుపడుతుందనే నమ్మకము మొదటినుంచీ మనకు వుంది. ప్రస్తుతము దేశములో బోధలుచేస్తేతప్ప పరివర్తనలు కలిగే అవకాశములు కనపడటములేదు.

ఆర్థికదృష్టి ఏర్పడి ఆర్థికపరివర్తనకూడా దేశంలో సంపూర్ణంగా రావాలి. ప్రస్తుత ఆర్థిక విధానము పెట్టుబడిదారీ ఆర్థిక విధానము. పెట్టుబడిదారీ ఆర్థిక విధానము దేశమును అపభ్రంశములలోకి దింపివేసింది. దేనికి అధికారముండకూడదో దానికి నేడు అధికారము సంభవించింది.

"ఆంధ్రరాష్ట్రసిద్ధి నేటికి ఎన్నడో మనకు కలిగివుండేది. మనం యాచించి వుంటే. మనం యాచించలేదు. రాష్ట్రము ఏర్పడినా భారతదేశము ఐక్యతను అభివృద్ధిచేస్తూ దేశములో పరివర్తనమార్గములు అన్వేషించి పరివర్తన తీసుకురావలెను.

ఆంధ్ర రాష్ట్ర సమస్య పాకిస్థాను సమస్య కాదు. ఈపట్ల జాగ్రత్తఅవసరం. ఇదివరలో మద్రాసే కేంద్రపట్టణము కావాలన్నా–ఇప్పుడు చాలామంది దృష్టి మద్రాసుమీద తప్పినది. హైదరాబాదు–ఆంధ్రదేశములో కలిసే అవకాశములున్నాయనే పరిస్థితులు ఏర్పడటము ఇందుకు కారణము.

ఇంతేకూ పరస్పర వైమనస్యము లు కల్పించుకోకుండా భారతదేశపు భవిష్యత్తునే ముఖ్యముగా పరిగణించి, పరిశీలిస్తూ–రాష్ట్రవృద్ధి చేసుకొనడము మన అందరి అభిమతము కావాలి."

శ్రీ కేశవతారంగారు అవరణలో అలంకారములు చేసిన ద్వారములూ–వాటి ప్రాశస్త్యమునుగురించి ఉపన్యసించారు.

సుభాకరరావు, వి. సుబ్రమణ్యం, పేరిశాస్త్రి జానీ, ప్రకాశరావు, నరసింహాచారి, ఎన్. వి. సుబ్రమణ్యం వాద్యసమ్మేళనము చేశారు.

'రాత్రిభోజనకాలపంలో భామాకలాపం' శ్రీ ముద్దుకృష్ణగారు రచించిన రూపకమును ప్రదర్శించారు.

శ్రీ మాచారి; ప్రభాకరరావు, సూర్యప్రకాశరావు, సూర్యనారాయణ, రామశాస్త్రి, ధనంజయరావు, జగన్నాధరావు, సోములుగారలు ప్రదర్శనంలో పాల్గొన్నారు. నాటకమునకు దర్శకత్వం పి. శాస్త్రులుగారిది.

## దేశోద్ధారకుని చిత్రపటావిష్కరణ

### నగరపాఠశాలలో సభ

#### నాగేశ్వరరావు పంతులుగారి సేవా ప్రశంస

మదరాసు, డిసెంబరు 13: విశ్వదాత దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి చిత్రపటమును ఆంధ్రప్రథ సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు నిన్న సాయంత్రము చూళైమిూ హిందూ యూనియన్ కమిటీ బాలికా పాఠశాలలో ఆవిష్కరించిరి.

పాఠశాల తెలుగు ఉపాధ్యాయుడు శ్రీ యం. కె. రామానుజాచారిగారు స్వాగత మిచ్చిరి.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మాట్లాడుచూ శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు గొప్ప శిల్పులు అనిరి. శిలమంటే మనకు మామూలుగా తెలిసిన అర్థముగాక జీవితమును క్రమబద్ధముగా నిర్మించుకొనుట. ఈ గుణము మాతరమువారికి లుప్తమైనది. జీవితమనే గృహమును చక్కగా క్రమబద్ధముగా నిర్మించుకొన్న వారిలో శ్రీ పంతులుగా రొకరు. ఈనాటివారు వారిని ఆదర్శముగా వుంచుకొనవలెననిరి. పంతులుగారి సంబంధములేని ఉద్యమము మేమీలేదు. అటువంటివారి చిత్రపటమును పెట్టుకొంటున్నందు కెంతయు సంతోషముగా యున్నది. వారి పటము ప్రక్కనే వీరేశలింగం పంతులుగారి పటమునుకూడ పెట్టవలెనని శాస్త్రిగారు సూచించిరి.

శ్రీ సుబ్బరాయులుచెట్టిగారు, కల్పవృక్షములాంటివారనుచు శ్రీ వెంకటేశ్వరరావుగారిని పంతులుగారి పటమును ఆవిష్కరించవలెనని కోరిరి.

చిత్రపటమును ఆవిష్కరించుచు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగా రిట్లు చెప్పిరి. "తెలుగుదేశములో పత్రికాపఠనమున ప్రజలకు అభిరుచి కలుగజేసినది శ్రీ పంతులుగారే. ప్రజల విజ్ఞానమునకు పత్రికల అవసరమునుగురించి 1908 లో ఆంధ్ర పత్రికను వారపత్రికగా స్థాపించి 1914 లో దినపత్రికగా మార్చి ప్రచురించిరి. మొట్టమొదటగా తెలుగుదినపత్రికను శ్రీ పంతులుగారు స్థాపించిరి.

"ఓను లేయని యొనర్చిన సరవర, యుప్రియము లేన మనంబున కగు దానోరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్" అనే నీతిని ఆదర్శముగా వుంచుకొని వారు పనిచేసేవారు.

పత్రికలు బాగుపడాలంటే మంచిరచనలను సంపాదించవలెను. మంచి రచనలు కావలెనన్న రచయితలకు డబ్బు ఇవ్వవలెను.' ప్రప్రథమముగా తెలుగు రచయితలకు డబ్బుఇచ్చేపద్ధతిని ప్రవేశపెట్టినది పంతులుగారే.

పంతులుగారు స్వయంగా పత్రికకు వ్రాస్తూవుండేవారు. వారివ్రాతలలో చురుకుదనం తక్కువఅయినా లాలిత్యము మృదుత్వము వుండేది. వారు ఏది వ్రాసినా ఇంపుగా వుండేది."

ఏక లిపినిగురించి శ్రీ పంతులుగారుచేసిన సేవనుగురించి చెప్పుచు వెంకటేశ్వరరావుగారిట్లనిరి. "మనదేశములో చాలభాషలు పలు లిపులు వున్నవి. ఇందువలన ఒక భాషవారు మరొకభాషను నేర్చుకొనుట కష్టముగా యున్నది. అలా కాకుండా దేశములోని భాషలన్నిటికీ ఒకే లిపి యున్నట్టయితే భాషలు నేర్చుకొనుటకు అవకాశముగా వుంటుంది. హిందీ మహారాష్ట్రము బంగాళీభాషలు దాదాపు ఒకటిగా వుండును. అరవ, తెలుగు లిపులను మార్చిన దేశమునకు ఒకేలిపి జూచుటకు అవకాశముండును. ఏక లిపి లేనందువలన బెల్లిలింటరు వగైరా ముద్రణాయంత్రములు ఏర్పడుట కష్టముగా యున్నది. ఈ కష్టమును పంతులుగారు ఏనాడో ఊహించి నాగిర లిపి బాగుండునని తలచి భారతిలో ప్రతినెలా నాగరలిపిలో ఒక తెలుగు వ్యాసమును అచ్చువేయుచుండెడివారు. ఆ రోజుల్లో దేశమంతకు ఏక లిపి వుంటేబాగుంటుందని పంతులుగారు కృషిచేసిరి.

మొట్టమొదట దినపత్రికను స్థాపించినది పంతులుగారు. రచయితలకు డబ్బుయిచ్చేపద్ధతిని ప్రవేశపెట్టినది వారు. చిత్రప్రాధాన్యమును గుర్తించి మొట్టమొదటగా బ్లాకులను తయారుచేయుట ప్రారంభించినదీ వీరే. ఈ విధముగా తెలుగు పత్రికారచనకు ఆకృతి ఎన్నో నవకల్పనలు పెట్టిరి. అటువంటి మహా గొప్పవారి చిత్రపటమును ఈ పాఠశాలలో పెట్టుట ఎంతయూ సంతోషము. ఆంధ్రభాషాభివర్ధనీ సమాజాధ్యక్షుడు శ్రీ పాలవన్సగారు అభినందనలు తెలిపిరి.

### న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 12:

| | | | |
|---|---|---|---|
| డిశెంబరు | 30.20 / 30.20 | మార్చి | 30.16 / 30.15 |
| [illegible] | 30.02 / 30.02 | జూలై | 29.50 / 29.50 |
| అక్టోబర్ | 27.84 / 27.84 | డిశెంబరు | 27.[illegible] / నా. |
| మార్చి | 27.66 / నా. | మే | 27.[illegible] / నా. |

| | | |
|---|---|---|
| లివర్పూల్ | హాజరు | 30.[illegible] |
| మార్చి | (గరిష్టము) | 30.19 |
| | (కనిష్ట) | 30.04 |

## త్యాగరాయ నగర ఆదిఆంధ్ర సేవాసంఘం

### తమ నివాసాలు మార్పించరాదని మేయరుకు విజ్ఞప్తి

చెన్నపట్నం, డిసెంబరు 13: త్యాగరాయనగర ఆది ఆంధ్ర సేవాసంఘము వారు నిన్నరాత్రి మద్రాసు మేయరు డా॥ చెరియన్, డెప్టీ మేయరు రాజా బాదర్ గారలకు సన్మానపత్రమును సమర్పించిరి. సంఘ అధ్యక్షులు వినాయగం గారు స్వాగతపత్రమును సమర్పించుచూ 80 ఏండ్లుగా తాము యాంబళం నివాసమునకు అలవాటు పడిపోయిరనియూ, మూడు సార్లు కార్పొరేషను అధికారులు తమ నివాసములను మార్పించిరనియూ, ఒక్కొక్క గుడిసె రూ 200/ చొప్పున వెచ్చించి కట్టుకొంటిమనియూ, కర్నాటక మిత్రమండలివారికి కార్పొరేషనువారు తాము అద్దెకు ఉంటున్న నెలవును వ్రాసిఇచ్చినదనియూ, తాము నిరుపేదలమనియూ, కారుణ్యముతో ఆ ఉత్తర్వును రద్దుచేయవలెననియూ కోరిరి. శ్రీ పీతాంబరంగారు గూడా ఆదిఆంధ్రుల కోర్కె సబబైనదనిరి. కె. సంజీవ కామత్ గారు కర్నాటక మిత్రులు ఈ స్థలమును విడుదలచేయునట్లు యత్నించెదమనిరి.

డెప్టీ మేయరు ఉచితరీతిన ప్రత్యుత్తరించిరి. డా॥ చెరియన్ గారు తమ శాయశక్తులా ఆ ఉత్తర్వును తప్పించుటకు యత్నించెదమనిరి. నగరమును పరిశుద్ధము చేయుపని ఉత్కృష్టసేవగా ఎంచవలెననియూ, గాంధీమహాత్ముడు గూడా దక్షిణాఫ్రికాలో మహత్తర సేవను చేసెననిరి. ఈ వృత్తి చేయువారు లేనిచో పౌరులు కష్టనష్టములకు లోనయ్యెదరనియూ, బయట నగరముకేగాక తమ నివాసములను గూడా శుద్ధముగా ఉంచుకొనవలెననిరి. కుళాయిలు, దీపాలు హరిజనవాడలకు వీలైనంతవరకు ఒకటొకటిగా జరిపించ యత్నించెదమనిరి.

శ్రీ రాఘవులుగారి వందనములతో సభ ముగిసెను.

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణం లోపరహితంగాజరగాలి

### రామలింగారెడ్డిగారి హితవు

(స్వకీయ విలేఖరి)

విశాఖపట్టణము, డిసెంబరు 12: ఆంధ్ర విశ్వకళా పరిషత్ విద్యార్థుల ఆంధ్ర అభ్యుదయ ఉత్సవములను నిన్న సాయంత్రము శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రారంభించారు. ఆంధ్ర ఉద్యమములో నూతన దృక్పథము ప్రారంభసమయంలో–విద్యార్థులు–అమితోత్సాహముతో–విశ్వకళాపరిషత్తు ఆవరణను అలంకరించారు. సభామంటపమునకు దారిలో శాలివాహనశకములో ప్రారంభించి తంజావూరు ఆంధ్రరాజుల రాజ్యకాలమువరకూ ఆంధ్రదేశమును ఏలిన రాజవంశమునకు ఒక్క సభాద్వారము చొప్పున అలంకరించారు. కీర్తిశేషులైన ఆంధ్రరాజుల పేరులు స్మరణకు తెస్తూ సభాద్వారములమీద వారి పేరులు లిఖించారు. సభజరిగిన అవరణలో కవిత్రయము మొదలుకొని కీర్తికాయులైన ఇతర ఆంధ్రకవులూ, గాయకులూ, వేదులను అన్నివైపులా లిఖించారు. ఆంధ్రులనూ, ఆంధ్రదేశమునూ ఆశ్రయించుకున్న శోభనంతను విద్యార్థులు తమ "ఉత్సాహమునకు తగినంతగా చేయలేకపోయినా, శక్తికొలది"వరకూ అలంకరించారు. శ్రీ రజని కాంతరావుగారు ఆంధ్రమాత స్తోత్రగేయములు పాడినారు.

ఆంధ్ర అభ్యుదయ ఉత్సవములు ప్రారంభిస్తూ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఇలా అన్నారు:

"ఈ ఆంధ్ర అభ్యుదయ ఉత్సవములు అనేకవిధములుగా వృద్ధియగు ఉత్సవములు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉద్యమమునకు అనుకూలపడే ఉత్సవములివి. ప్రజలలో, విద్యార్థులలో, విద్యాధికులలో రాష్ట్రసాధనకు ఇటువంటి ఉత్సవములు అనుకూలపడినవని చెప్పవచ్చును.

"ఇల్లు అలుకుటతోనే పండుగ కాదు. మనకు స్వాతంత్ర్యప్రాప్తితో చాలా కష్టములు వచ్చాయి. ఇది గొప్ప వస్తుల లక్షణము. ఒకదిక్కున వెలుతురు, ఒక దిక్కున నీడ. ఎప్పుడూ పూర్ణిమగా వుండదు. అమావాస్యకూడా వచ్చును. చరిత్ర పరిస్థితులను బట్టి ధర్మ విమర్శ వుంటుంది. కాలం మన అధీనంలో వుండదు. వితరణతో విజ్ఞానంతో విచారించవలసిన విధిమనది. ఆంధ్రరాష్ట్రము వస్తూన్న తరుణములో నాయకులలో అభిప్రాయ భేదములు వచ్చినట్లు వార్త కనపడ్డాయి.

"మనము విశ్వకళాపరిషత్తు సంపాదించుకున్నాము. విజయవాడ కేంద్రమూ, రాజమహేంద్రవరము కేంద్రమూ అని ఐదు ఊళ్ళమధ్య మనస్పర్థలు ఏర్పడినవి. మొదట విశ్వకళాపరిషత్తును పరిశీలసంస్థ క్రింద వుంచవలెనని చాలాకుంది పోటు పడ్డారు. వస్తుంపోయింది. నామమాత్రస్థితి సిద్ధించింది. విశాఖపట్టణము చేరాము.

"మనకు విమర్శకపద్ధతి ఎక్కువ. చెట్టు ఏలా పెరిగిందో వేరుతో పెరికిచూడవలెననే కోరికతో కొందరు ఆరంభించారు. ఇదికూడదు. ఇందువలన నష్టమేగాని లాభమేమియు లేదు. శ్రీబాగ్ ఒడంబడిక ప్రకారం మనం మన పరిపాలనా కేంద్రాలను ఏర్పాటుచేసుకొనవచ్చును. కెనడా దేశములో ముఖ్యపట్టణము ఒకటి, విశ్వవిద్యాలయ కేంద్రము ఒకటి. సెక్రెటేరియట్ అనేమహోన్నత వృక్షుప్రక్కన విశ్వకళాపరిషత్తు బ్రతకదు. దక్షిణ ఆఫ్రికాలో రాజకీయ కేంద్రము, శాసనసభాకేంద్రమూ పరిపాలనా కేంద్రమూ, న్యాయస్థాన కేంద్రమూ – అని వేరు వేరు కేంద్రములున్నవి. అట్లే మనము చేసుకొనవచ్చును.

విజయవాడ పట్టణమే – తప్పక శాసనసభా కేంద్రము. రాయలసీమకు, ప్రధాన న్యాయస్థానమూ, మరికొన్ని ఇవ్వవచ్చును. ఇపుడు కేంద్రములగురించి ఆందోళనజరుగుచున్నది. కార్యసాధనకుముందు ఎంత దీర్ఘ ఆలోచన చూపాలో, కార్యమప్పుడూ అంతదీర్ఘంగా ఆలోచించవలెను. పరిహద్దులు నిర్ణయము చేసుకొనుట సులభము కాదు.

రాష్ట్రనిర్మాణం మానవనిర్మాణ సేతువు. మనకు ప్రత్యేక రాష్ట్రం ఉండవలసిందే, మనం భ్రమకు పాత్రులము కాకూడదు. నమిత్రప్రజలన–భ్రమకుపాత్రులను చేయకూడదు. [illegible] బ్లూప్రింట్ ఏలా తయారు చేసుకుంటామో – అలా – రాష్ట్రానికి సంబంధించిన అన్ని విషయములూ స్థిరం చేసుకుని బయటపడితే బాగుంటుంది. మద్రాసు

## "గాంధీజీ సందేశాలు ఆచరణలో పెట్టినప్పుడే ప్రస్తుత క్లిష్టస్థితి నుండి బయటపడగలము"

### విద్యార్థులు తమ బాధ్యతలను గుర్తించి ప్రవర్తించాలని కళా వెంకట్రావుగారి హితవు

రాజమహేంద్రవరం: డిశెంబరు 11: "స్వాతంత్ర్యం సిద్ధించుటతో భారతావని కష్టపరంపరలనుదాటి శాంతి సౌభాగ్యాలతో వర్ధిల్లగలదని మనంఆశించాము. కాని యింకా మనదేశం విపత్కర విషమ పరిస్థితులలోనే యున్నది. కోట్లకొలది భారతీయులు కడుపునిండా తిండి, ఒంటినిండా బట్ట, నిలువడానికి నీడ పొందజాలక పడరాని పాట్లుపడుచున్నారు. ఈ దుస్సంఘటనలు కండ్లార చూస్తూవుంటే ఒక్కొక్క సమయంలో ప్రతివారికి స్వరాజ్యంమీదనే నిరాశ, నిస్పృహ జనించుట సహజము. అయితే యీక్లిష్టస్థితినుండి దేశమును రక్షించుటకై ప్రతివారూ శాయశక్తులా కృషి చేయవలెనుగాని నిరాశ చెందరాదు. లోకపూజ్యుడైన గాంధీమహాత్ముని సందేశాలు మనం ఆచరణలో పెట్టగల్గిననాడు తప్పక మనమీగడ్డుస్థితినుండి బయటపడగలము." అని నిన్న సాయంత్రం యిచ్చట ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల భవనంలో జరిగిన విద్యార్థులసభలో అఖిల భారత కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి శ్రీకళా వెంకట్రావుగారు ఉద్ఘాటించిరి.

కళాశాల ఉపాధ్యక్షులు తిరువెంకటాచారిగారు వెంకట్రావుగారి ప్రతిభను ప్రశంసిస్తూ ప్రసంగించిన పిమ్మట వెంకట్రావుగారు మాట్లాడుచూ యింకా యిట్లనిరి.

"నేటి విద్యార్థులే రేపు దేశపరిపాలకులు, సేవకులు కానున్నారు. తాము నేర్చుకొనువిద్య, విజ్ఞానాలవల్ల దేశంలోని క్లిష్టసమస్యల్ని పరిష్కరించుటకై కృషిసల్పవలసిన బాధ్యత విద్యార్థులపైగూడ గలదు. నేడు మనదేశంలో అనేకపార్టీలున్నవి. విద్యార్థుల ఉద్రేకంవల్ల ఏదో ఒకపార్టీ [illegible] ప్రజాసౌభాగ్యానికి [illegible] దర్శకం కాగలవో [illegible] సరించవలెను. రష్యాదేశం ప్రజాస్వామికం కాని సోషలిస్టు రాజ్యము. అమెరికా సోషలిజం లేని ప్రజాస్వామికము. మనం ప్రజాస్వామికంతో గూడిన సోషలిస్టు రాజ్యస్థాపనకు కృషిచేయవలెను; ఇందులో విద్యార్థుల బాధ్యత చాల గురుతరమైనది. కనుక విద్యార్థులు తమ బాధ్యత గుర్తించుకొని వీలైనంత ఎక్కువగా చదివి విజ్ఞానాన్ని పెంపొందించుకోవలెను. స్వతంత్ర భారతంలో ప్రతివారూ హిందీ నేర్చుకొనుట ముఖ్యావసరము."

ఆంధ్రరాష్ట్ర విభజనగురించి విద్యార్థులడుగగా సాధ్యమైనంత త్వరలో బహుశా జనవరి 26 నాటికే రాష్ట్రవిభజన జరుగవచ్చుననీ, తాము ఆశించుచుంటిమనీ యింతకంటె ఎక్కువగా ఏమీ చెప్పలేమనీ వెంకట్రావుగారనిరి. పత్రికలనుగురించి మాట్లాడుచూ పత్రికలను జాతీయంచేయుటకు తాము సుముఖులమని వెంకట్రావుగారు తెల్పిరి.

జనగణమన ప్రార్థనతో సభ ముగిసెను. రాత్రి శ్రీ కళా వెంకట్రావుగారి గౌరవార్థం జి. వరదరావుగారు విందు చేసిరి. మాదిన నరసన్న (తూ. గో. జిల్లా బోర్డు అధ్యక్షులు) డా॥ కె. యల్. నరసింహారావు (పట్టణకాంగ్రెస్ అధ్యక్షులు) మాడ వీరాస్వామిరెడ్డి (కార్యదర్శి) నీరుకొండ రామారావు, చాగంటి సత్యనారాయణమూర్తి, మద్దూరి శివరామకృష్ణయ్య, పాలకోడేటి సూర్యప్రకాశరావు, పెన్మత్స సత్యనారాయణరాజు మున్నగు ప్రముఖులు విందుకు హాజరైనారు. విందు ముగిసినతర్వాత వెంకట్రావుగారు మిత్రులతో కలసి జయాటాకీస్, శ్యామల టాకీస్ లను దర్శించిరి. సినీమా యజమానులు వెంకట్రావుగార్ని పూలమాలా లంకృతునిజేసి సత్కరించిరి. (స్వ. వి.)

## ఆంధ్ర హైకోర్టు

### తిరుపతి బహిరంగసభలో తీర్మానం

తిరుపతి, డిసెంబరు 11: నిన్న సాయంకాలం ఆర్. పార్థసారథి నాయుడిగారి అధ్యక్షతన జరిగిన బహిరంగసభలో ఆంధ్రరాష్ట్రముయొక్క వున్నత న్యాయస్థానము తిరుపతిలో ఏర్పాటుచెయ్యవలెనని ఆంధ్రనాయకులకు కోరుతూ ఒక తీర్మానం చేశారు. యం. గోపాలాచార్లు డా॥ పి. టి. జగన్నాధరావు, బి. రాధాకృష్ణయ్య, పి. మునస్వామి, ఎం. శ్రీనివాసాచారి, కే. ఎల్. నరసింహాచారి మున్నగువారు ప్రసంగించిరి.

ఆంధ్రరాష్ట్రములోకూడ, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేయుటకు తగు చర్యలు తీసుకోవాలని కోరుతూ వేరొకతీర్మానం చెయ్యబడింది. ఎస్. రామాచారిగారి వందనములతో సభ ముగిసింది. (స్వ. వి)

## కాంగ్రెసు అర్హతా సభ్యత్వము

### ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సూచన

విజయవాడ, డిశెంబరు 12: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కందుల ఓబులరెడ్డిగారు ఇలా వ్రాస్తున్నారు:

అఖిలభారత కాంగ్రెసు సంఘంవారు యీయేడు కాంగ్రెసు అర్హతా సభ్యులను చేర్పించుటకు 1949 డిశెంబరు 15 వ తేదీ ఆఖరు గడువుగా నిర్ణయించారు. మరియు రాష్ట్రంలో అర్హతా సభ్యుల మొత్తం సంఖ్యను డిశెంబరు 31 వ తేదీలోగా తమకు తెలియబరచవలయుననియు కోరియున్నారు. కొన్ని తాలూకా, పట్టణ జిల్లా కాంగ్రెసు సంఘాలు అర్హతా సభ్యత్వ ఫారములు తీసికొనక నిరాకరించుచున్నారనియు, మరి కొందరు ఫారములు తీసికొని, రసీదులు యివ్వటం లేదనియు ఫిర్యాదులు వస్తున్నాయి. ఇలాంటి ఫిర్యాదులకు యికముందు ఏకాంగ్రెసుసంఘం తావీయరాదు. అట్టిఫిర్యాదులు వచ్చుచో విచారించి, క్రమశిక్షణ చర్య గైకొనబడుననియుగూడ అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శిగారు తమ పత్రికా ప్రకటనలో హెచ్చరించియున్నారు.

వ్యక్తులు తాము చేర్పించిన అర్హతా సభ్యత్వ ఫారములను డిశెంబరు 17 లోపుగనే సంబంధించిన, తాలూకా, పట్టణ జిల్లా, రాష్ట్రకాంగ్రెసు కార్యాలయములలో ఎచ్చటనైనను దాఖలుచేసి, రసీదులు పొందవలయును. తాలూకా, పట్టణ, జిల్లా సంఘములవారు సకాలంలో తమ తమ కార్యాలయములందు దాఖలయిన అర్హతా సభ్యత్వఫారముల సంఖ్యను డిశెంబరు 19వ తేదీననే తంతిమూలకంగా రాష్ట్రకాంగ్రెసు కార్యాలయమునకు తెలియబరుస్తూ ఆసంఖ్యనులేఖద్వారాధృవపరచవలయును. మరియు 1949 డిశంబరు 22 తేదీలోగా తమతమ కార్యాలయములలో దాఖలయిన అర్హతా సభ్యత్వ రుసుము మొత్తమును రాష్ట్ర కాంగ్రెసు కార్యాలయమునకు పంపవలయును. పట్టణ, తాలూకా, సంఘములు అట్లు తమతమ కార్యాలయములలో దాఖలయిన అర్హతాసభ్యత్వఫారములను అనుసరించి డిశెంబరు 28 తేదీలోగా అర్హతా సభ్యత్వ లిస్టులు మూడు కాపీలు తయారు చేయవలెను. తాలూకా,పట్టణ సంఘముల వారు జిల్లా, రాష్ట్ర సంఘములకు చేరియొక కాపీని పంపవలయును జిల్లా సంఘములవారు యిదే విధముగ తమ కార్యాలయములలో దాఖలయిన అర్హతా సభ్యత్వ ఫారముల ననుసరించి డిశెంబరు 25 తేదీలోగా మూడు సభ్యత్వ లిస్టులను తయారుచేసి, ఒక కాపీని రాష్ట్ర కాంగ్రెసు సంఘమునకున్ను మరియొక కాపీని సంబంధించిన తాలూకా లేక పట్టణ సంఘాలకున్ను పంపవలయును.

రాష్ట్ర కాంగ్రెసు సంఘంగూడ ఇదే విధముగా తమ కార్యాలయములో దాఖలయిన అర్హతా సభ్యత్వ ఫారముల ననుసరించి డిశెంబరు 30 తేదీలోగా మూడు సభ్యత్వపు లిస్టులను తయారుచేసి, ఒక కాపీని సంబంధించిన జిల్లా సంఘమునకున్ను, మరియొక కాపీని సంబంధించిన తాలూకా లేక పట్టణ సంఘమునకున్ను పంపును.

అర్హతా సభ్యత్వ లిస్టులను తయారు చేయుటలో తాలూకాలు గ్రామాలు వారిగను, పట్టణ సభ్యత్వ లిస్టులు తయారు చేయుటలో వార్డుల వారిగను, లిస్టులు తయారు చేయవలయును.

ఈ విధంగా రాష్ట్రము మొత్తముమీద అన్ని తాలూకా, పట్టణ, జిల్లాసంఘములను రాష్ట్ర సంఘంగూడ తమ తమ ప్రాంతాలకు సంబంధించిన అర్హతా సభ్యత్వలిస్టులు చేరియుండును. ఇట్లు చేరియున్న తమ తమ ప్రాంతాలకు సంబంధించిన అర్హతా సభ్యత్వ లిస్టులను 1950 జనవరి 2 తేదీనుండి 10 వ తేదివరకు వ్యక్తుల పరిశీలనకై తెరిచి యుంచవలయును.

### క్లెయిములు, ఆక్షేపణలు

అర్హతా సభ్యత్వ జాబితాలలో ఎవరి పేరైన చేర్చవలసియున్న లేక తొలగించవలసియున్న తమ కారణములకు ఉదాహరిస్తూ క్లెయిమ్ లేక ఆక్షేపణ పిటీషను జనవరి 10 తేదీలోగానే దాఖలు చేయవలయును.

తాలూకా, పట్టణ, జిల్లా సంఘాలు తమ తమ కార్యాలయాలలో దాఖలయిన ఆక్షేపణ, క్లెయిమ్ పిటీషన్లను, వాటి తాలూకు రుసుమున్ను సంబంధించిన జిల్లా కాంగ్రెసు క్రెడెన్షియల్స్ కమిటీకి జనవరి 10 వ తేదీలోగా పంపవలయును.

1950 జనవరి 1 వ తేదీలోగానే జిల్లా క్రెడెన్షియల్స్ కమిటీలు సమావేశమై, జనవరి 15 అనంతరం ఏతాలూకాకు, ఏపట్టణమునకు సంబంధించి ఆక్షేపణ క్లెయిమ్ పిటీషన్లను, ఏ తేదీలందు ఎచ్చట విచారింపనదియు నిర్ణయించుకొని, తమ విచారణ కార్యక్రమమును నోటీసు ప్రకటనార్థము సంబంధించిన జిల్లా, తాలూకా, పట్టణ సంఘములకున్ను, రాష్ట్రసంఘమునకున్ను, రాష్ట్ర క్రెడెన్షియల్స్ కమిటీకిన్ని పంపవలెను. జిల్లా క్రెడెన్షియల్స్ కమిటీలు జనవరి 30 వ తేదీలోగా తమ విచారణ కార్యక్రమమును పూర్తిచేసి, ఆక్షేపణ, క్లెయిమ్ పిటీషన విషయమై తమ తీర్పులను సంబంధించిన జిల్లా, తాలూకా, పట్టణ సంఘములకున్ను, రాష్ట్రసంఘమునకున్ను పంపవలయును.

జిల్లా క్రెడెన్షియల్సుకమిటీ తీర్పులపై రాష్ట్రకాంగ్రెసు క్రెడెన్షియల్సు కమిటీకి అప్పీలు చేసికొనుటకు ఫిబ్రవరి 15 వ తేదీ ఆఖరు తేదీగా నిర్ణయించుట మైనది.

రాష్ట్ర క్రెడెన్షియల్సు కమిటీ వారు 1950 జనవరి 15 లోగానే ఏయే జిల్లాల నుండివచ్చు అప్పీళ్ళను ఏయే తేదీలందు ఎక్కడ విచారించేది తెలియబరచు తమ విచారణ కార్యక్రమమును నిర్ణయించవలెను, కాపీలను నోటీసు బోర్డు ప్రయోగార్థం పట్టణ, తాలూకా, జిల్లా, రాష్ట్ర సంఘాలకున్ను, జిల్లా క్రెడెన్షియల్సు కమిటీలకున్ను పంపవలయును.

### అప్పీళ్లపై రాష్ట్ర కమిటీ తీర్పులు

1950 ఫిబ్రవరి నెలాఖరులోగా రాష్ట్ర క్రెడెన్షియల్సు కమిటీవారు అప్పీళ్లపై తమ అంత్య తీర్పునిస్తూ, దానిననుసరించి, ఏతాలూకా, పట్టణములకు సంబంధించిన అర్హతా సభ్యత్వ లిస్టులలో ఏయే మార్పులు జరుగవలయునో నిర్ణయించి, తాలూకా, పట్టణ, జిల్లా కాంగ్రెసుసంఘములకు 1950 ఫిబ్రవరి నెలాఖరులోగా పంపవలయును.

రాష్ట్రక్రెడెన్షియల్సు కమిటీవారి అంత్యతీర్పు ననుసరించి అర్హతా సభ్యత్వ జాబితాలలో 1950 మార్చి 5 లోగా మార్పులుగావించి నికరజాబితాలు ప్రకటించవలయును.

పట్టణ, తాలూకా, జిల్లారాష్ట్రసంఘములవారు తమతమ కార్యాలయములలో దాఖలయిన ఆక్షేపణ, క్లెయిమ్ పిటీషన్లను ఏరోజుకారోజు ప్రకటించవలయును. వీటిప్రతి జిల్లాక్రెడెన్షియల్సు కమిటీకి పంపవలయును.

క్లెయిమ్, ఆక్షేపణ పిటీషన్లు దాఖలు చేయువారు రెండు కాపీలుగా దాఖలు చేయవలయును. క్లెయిమ్ చేయబడు, లేక ఆక్షేపించబడు ప్రతిఒక్క పేరునకు ఒక అణా నిర్ణయించడమైనది.

ఇదేవిధంగాజిల్లాక్రెడెన్షియల్సు కమిటీ తీర్పులపై రాష్ట్రక్రెడెన్షియల్స్ కమిటీకి అప్పీళ్ళు దాఖలుచేయువారు ప్రతి ఒక్క పేరునకు రెండు అణాలచొప్పున అప్పీలు రుసుము చెల్లిస్తూ, అప్పీలు పిటీషను రెండు కాపీలను పట్టణ, తాలూకా, జిల్లారాష్ట్ర సంఘములలో, యే ఒక్కచోటనియందైనను దాఖలు చేయవలయును. పైకాంగ్రెసు సంఘములవారు అందు ఒకకాపీని ప్రకటిస్తూ, (అప్పీళ్ల పిటీషను కాపీని), రెండవకాపీని అప్పీలురుసుముతోసహా రాష్ట్రక్రెడెన్షియల్స్ కమిటీకి ఏరోజుకారోజు పంపుతూ వుండవలయును.

1950 జనవరి నెలాఖరులోగా జరుగు ప్రాథమిక పంచాయితీలకు యెన్నుకోబడిన పంచాయితీదార్ల పేర్లు అర్హతా సభ్యుల జాబితాలలోనుండి తొలగించబడియున్నచో అట్టి పంచాయితీదార్ల ప్రాథమిక పంచాయితీ యెన్నికపదవి దానంతటదే రద్దు అగును.

కందుల ఓబులరెడ్డి,
ప్రధానకార్యదర్శి.

## బియ్యం దిగుమతి

'శారో' అనే ఓడ 2006 టన్నుల బియ్యముతీసుకొని డిసెంబరు 11 న మద్రాసు రేవుచేరెను. సరుకునంతనూ అచ్చట కేంద్ర గిడ్డంగులలో నిల్వచేసెదరు.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 13:

బంగారు – వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1–8 ఎక్కువ తోడు సేల్సుటాక్సుతోసహా రు. 76–10–0 పెట్లా బంగారు తులం 116–0–0 మూసబంగారు 113–6–0 సీమవెండి తులం 170–8 (రెడీ) 173–0–0 వెండి తులం 1–8 1–12–0

వేరుసెనగ: (581 కా 1–8 ఎక్కు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది రు. 183–0–0 (కోరమాండల్)

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (వీవరేజి) రు. 327–0–0 3 టు5% యఫ్. యఫ్. ఏ. ఇంగ్లాండునూనె (87 పౌన్లు కల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్విలాన్. రు. 87–12–9, 89–9–0

### ఆముదం

కాండీ 500 పౌనులంగలది రు. 260–0–0
(ఒంగోల్, నరసరావుపేట) రు. 270, 280

### పంచదార

| | | |
|---|---|---|
| నర్కాటాగంజి (2ఆందరు) | | రు. 94–9–5 |
| హాసన్ పూర్ | ,, | రు. 93–1[illegible]–0 |
| మోతీపూర్ | ,, | రు. 94–7–0 |

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ నవమి 1949 సం॥ డిసెం॥ 14 బుధవారం బ॥ నవమి ప 4-30ని హస్త రా 3-11వర్జ్యం ప 12-31 ల 2-2 కు.

బ॥ దశమి డిసెం॥ 15 గురువారం గు॥ దశమి ప 2 11 చిత్ర రా 1-24 వర్జ్యం ప 10 30 ల 12-4 కు.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ మార్గశిర బ॥ నవమి
బుధవారం

## రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సూచన

రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గము ఈనెల 11 వ తేదీ సమావేశమై నూతన్న రాజ్యాంగము అనులుకు వచ్చి స్వతంత్రభారత రిపబ్లిక్ అవతరణతో ప్రత్యేకాంధ్ర రాష్ట్రి నిర్మాణమునకు అవకాశము కల్పింపవలసినదని చెన్న రాష్ట్ర ప్రభుత్వమును కోరుచు తీర్మానించి స్వధర్మమును కొంతవరకు నిర్వర్తించినది. చెన్న రాష్ట్ర విభజన కలాపములను అధికార ఉపసంఘములు ఎట్టికాలహరణము లేక నిర్వహించుచున్నను, విభజన సంఘ సభ్యులు కొందరు చేసిన ప్రకటనలనుబట్టి ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉత్తరువు, నూతన్న రాజ్యాంగము నందలి రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను చేర్చుకొనుటకు వీలుగ నకాలమున జారీ యగుటకు అవకాశము లేకపోవచ్చునను సందేహములు కలుగుచున్నవి. కేంద్ర ప్రభుత్వ హోంశాఖ రాష్ట్ర ప్రభుత్వమునకు పంపినలేఖ ఈసందేహములకు ఎక్కువ బలము నొసగుచున్నది. ప్రత్యేకాంధ్ర రాష్ట్రము 1950 జనవరి 26 నకు గాక ఏప్రెల్ 1 వ తేదీకి నిర్మాణమగుట వాంఛనీయమని కేంద్ర ప్రభుత్వ లేఖ సూచించియుండుటవలన కేంద్రమంత్రివర్గము రాష్ట్ర నిర్మాణము నూతన్న రాజ్యాంగమును అనుసరించియే జరుగ నగునని అభిప్రాయపడినట్లు రాష్ట్ర మంత్రివర్గము భావించుటయు, తదనుగుణముగ విభజన కార్యక్రమమును నిర్ణయించుటయు జరిగినది.

కాని, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు ఆచార్య రంగాగారు ఢిల్లీనుండి వచ్చిన వెంటనే మా విజయవాడ విలేఖరికి తెలిపిన వివరములనుబట్టి ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణమునకు కేంద్ర మంత్రివర్గము సుముఖముగ నుండుటేగాక విభజన సంఘము వారొక సమాధానమునకు వచ్చినట్లు తెలిసిన ఉత్తరక్షణమున ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ ఉత్తరువును జారీ చేయుటకు సిద్ధముగనున్నట్లు స్పష్టమగుచున్నది. 1950 జనవరి 26 న రాష్ట్ర అవతరణకు వీలుగ గవర్నరు జనరల్ ఉత్తరువు రావలెనన్న విభజన సంఘము తన పనిని శీఘ్రముగ ముగింపవలసియుండును. కనుకనే రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గము విభజన కార్యక్రమమును రెండు దశలుగ విభజించి వెంటనే పరిష్కారానుకూలముగ లేని సమస్యలను ప్రస్తుతమునకు వాయిదా వేసి, స్థూలాంశములపై సమాధానమును సాధించి ఆ సమాధానము ప్రకారము 1950 జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు అవకాశము కల్పింపమని చెన్నరాష్ట్ర ప్రభుత్వమును కోరినది. ఈ విధానమును అనుసరించుటకు విభజన సంఘమువారికి గాని, చెన్నరాష్ట్ర మంత్రివర్గమునకుగాని ఎట్టి అభ్యంతరము ఉండరాదు.

1950 జనవరి 26 కంటె ఏప్రిల్ 1 వ తేదీ విభజన అమలుకు, నూతన్న రాష్ట్ర స్థాపనకు ఎక్కువ అనుకూలముగ వీలుగ నుండగలదను ఆర్థిక ప్రవీణుల వాదము అంత సహేతుకముగ నున్నట్లు కన్పింపదు. ఏప్రిల్ 1 నుండి క్రొత్త ఆర్థికసంవత్సరము ప్రారంభమగును. ఆసంవత్సరమునకు ఆదాయవ్యయ అంచనాలు ఆలోపుచే పూర్తియై రాష్ట్ర శాసనసభామోదమును పొందవలసి యుండును. ఏప్రిల్ 1 నుండి ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకముగవ్యవహరింపవలెనని తయారైన ఆదాయ, వ్యయ అంచనాలను విభజించుకొనవలసియుండును. విభజనవలన ఏర్పడిన క్రొత్త పరిస్థితులకు, సమస్యలకు తగినట్లు నిర్ణయమైన అంచనాలను మార్చుకొని తిరిగి క్రొత్తబడ్జెట్లను తయారు చేసుకొనవలసియుండును. పరిపాలన దృష్ట్యాకూడ వేరొక అసౌకర్యము గలదు. ఆర్థికశాఖవారు 1950-51 సంవత్సరపుఅంచనాలను తయారుచేయుటలో నిమగ్నులై యుందురు. అట్లే ప్రభుత్వ శాఖలన్నియు రాబోవు సంవత్సరమునకు తమ శాఖ అవసరములను పరిశీలించి, అందు కవసరమైన అంచనాలను తయారు చేసుకొనవలసియుండును. ఇందువలన విభజన కార్యక్రమముపై వీరు తమ దృష్టిని కేంద్రీకరింపజాలరు. తత్ఫలితముగ విభజన కార్యక్రమము మందముగ జరుగుటేగాక, కొన్ని సందర్భములందు న్యాయముకూడ జరుగకపోవచ్చును. కనుక ఈ మాసాంతములోపున విభజన సూత్రములు నిర్ణయించుకొని, ప్రస్తుతము అమలులో ఉన్న బడ్జెట్ అంచనాలను బట్టి ఇది మిగులు బడ్జెట్ కనుక ఎట్టి ఇబ్బందులు ఉండజాలవు. 1949 డిసెంబరు ఆఖరువరకు ఖర్చుఅయిన మొత్తములను మినహాయించి, మిగత గ్రాంట్లు మొత్తముతో నూతన్న ఆంధ్ర ప్రభుత్వము, మిగత చెన్నరాష్ట్ర ప్రభుత్వము వ్యవహరించుటకు వీలుగ ఏర్పాట్లు చేసుకొనిన, ఎట్టి ఒడుదుడుకులు లేక, పరిస్థితులు తారుమారగునను భయము లేక వ్యవహారమును సాగింపవచ్చును. 1950 ఏప్రెల్ 1 నుండి ఏభాగము నకు ఆభాగము, అప్పటికి చరస్థిరాస్తుల పంపకము పూర్తిగ పరిష్కారము కావచ్చును గనుక, సమగ్రమైన బడ్జెట్ అంచనాలను తయారుచేసుకొన వీలగును. ఆర్థిక వ్యవహారముల దృష్ట్యా ఇదే వాంఛనీయము.

విభజనసంఘము తన కార్యక్రమమును శీఘ్రముగ ముగింపలేకపోయిన, అందుకు కారణములు రాజకీయములుగాని, విభజన సమస్యల క్లిష్టత కారణముగాదని, భావింపవలెను. రాష్ట్ర ప్రభుత్వశాఖలన్నియు 1950 జనవరి 26 న ప్రత్యేకాంధ్ర రాష్ట్రము ఏర్పడునను భావముతోనే వ్యవహరించుచున్నట్లు తెలియుచున్నది. అంతియేగాక 1950 జనవరి 26 లోపుచే ప్రత్యేకాంధ్ర రాష్ట్ర మేర్పడవచ్చునను భావము బాదాపు ఒక సంవత్సరముగ సర్వత్ర ఏర్పడియున్నది. గతసంవత్సర మంతయు రాష్ట్రప్రభుత్వ వ్యవహారములు ఆభావముతోనే నిర్వహింపబడుచున్నవి. అట్టి విభజనకు ప్రజలేగాక, మంత్రులు, ప్రభుత్వ ఉద్యోగులుకూడ సిద్ధముగ నుండిరి. కనుక విభజన కార్యక్రమమును రాజకీయములనుండి వేరుచేసి, కొనసాగించిన 1950 జనవరి 26 లోపుచే ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉత్తరువు జారీయగుటకు వీలుగ ముగింపవచ్చును.

విభజన సంఘ సభ్యులలో అభిప్రాయభేదమునకు ఆస్కారమైనది ఆంధ్రరాష్ట్ర రాజధాని విషయమే నని తెలియుచున్నది. ఆంధ్రులు ముందుగ తమ రాజధానిని ఎచట ఏర్పరచుకొనెదరో స్పష్టముగ ప్రకటింపవలెనని విభజన సంఘమునందలి తమిళ సభ్యులు పట్టుబట్టినట్లు తెలియుచున్నది. హైదరాబాద్ భవిష్యత్తు నిర్ధారణ మగువరకు ఆంధ్రులు రాజధానివిషయమున ఎట్టి నిర్ణయము చేసినను అది తాత్కాలికమేయగును. కనుకనే ఆ సమస్యపరిష్కార మగువరకు తమ ప్రభుత్వ కేంద్రమును చెన్ననగరమునందే యుంచుకొందుమని ఆంధ్ర నాయకులు తెలుపుచుండిరి. తమిళ నాయకులు కోరినట్లు ఆంధ్ర తాత్కాలిక రాజధాని పేరు ప్రకటిత మైనంత మాత్రమున తమిళ నాయకులను కలవర పెట్టుచున్న చెన్నపట్నము భవిష్యత్తు సమస్య ఎట్లు పరిష్కారమగునో దురూహ్యము. చెన్నపట్టణము ఏ రాష్ట్ర భాగమైనను, ఆ రాష్ట్రము రాజధాని చెన్ననగరముగ నుండుట సాధ్యముగాదు. తమిళ నాయకులు ఈ స్వల్పవిషయమును గుర్తించిన విభజన సంఘమునందు వివాదములకుగాని అభిప్రాయభేదములకుగాని తావులేదు. ఈ విషయమును గ్రహింపక ఆంధ్రులు ముందుగనే తమ రాజధాని ఎచ్చటనో తెలుపవలెనన్న డాక్టర్ రామలింగారెడ్డిగారు సూచించినట్లు విజయవాడ ఆంధ్రరాష్ట్రమునకు తాత్కాలిక రాజధానియని విభజన సంఘమునందలి ఆంధ్ర సభ్యులు ప్రకటింపవచ్చును. రాజధాని పేరును ప్రకటించినంతమాత్రమున ఆంధ్ర ప్రభుత్వ స్థానము అచటకు మారిపోవలెనని, అది తక్షణము జరుగవలెనని తమిళ నాయకులు పట్టుబట్టజాలరు.

ఈ విధముగ విభజన సంఘమువారు సమాధానపడి, 1950 జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉత్తరువు జారీయగుటకు అవకాశము కల్పించెదరని, భారత రిపబ్లిక్తోబాటు ఆంధ్రరాష్ట్రం అవతరింపగలదని ఆశించుచున్నాము.

## డా॥ సోకర్నో ఇంటిసోదా

### సాయుధపంతకుల ప్రవేశం

బటేవియా, డిసెంబర్ 12: ఈ ఉదయం తెల్లవారే సరికి, స్టెన్గన్ను, రివాల్వర్లూ తీసుకుని, ముసుగులు వేసుకున్న 9 గురు సాయుధ హంతకులు బటేవియాలో వున్న, ఇండొనీషియా ప్రధాని సోకర్నో తాలూకు స్వంత గృహంలో ప్రవేశించారు. ఆ యింట్లో వున్న పరిచారక వర్గానికి యెవ్వరికీ తెలియని ఒక వ్యక్తిని గురించి భోగట్టా చెప్పమని వాళ్ళు నందర్నీ దబాయించారు.

వాళ్లు అడుగుతున్న మనిషి అ యింట్లో లేడనీ, అలని సంగతి తమకేమీ తెలియదనీ పరిచారకులు చెప్పిన అనంతరం హంతకులు వెళ్లిపోయారు.

ఈ హంతకులలో ఎనిమిదిమంది సైనిక దుస్తులలో వున్న ఇండోనేషియను లనీ, ఒకడు మాత్రం పౌరదుస్తులలో వున్న యూరపియనని చెబుతున్నారు.

పోలీసువారూ, మిలిటరీ అధికారులూ యీ విషయమై దర్యాప్తు చేస్తున్నారు. రక్షణశాఖవారుకూడా ఈ విషయం విచారణ చేస్తున్నారు. రక్షణశాఖా మంత్రి స్వయంగా జోగ్జకార్టానుంచి బటేవియా వచ్చారు.

ఈ హంతకులు యేదో రాజకీయ ముఠాకు చెందిన వాళ్ళయి వుంటారనీ, సోకర్నో యింటి చేరువలో పరిసర గృహాల్లో నివసించుతున్న మిలిటరీ అధికారులను చంపటానికి వచ్చి వుంటారనీ యిక్కడి అనధికార రాజకీయ వర్గాలవారు అభిప్రాయపడుతున్నారు.

## కేంద్రసెక్రటేరియట్లో మార్పులు

### పార్లమెంటులో సర్దార్ పటేల్ వివరణ

న్యూఢిల్లీ, డిసెంబర్ 12: కేంద్ర ప్రభుత్వ సెక్రటేరియట్ వ్యవస్థలో మార్పులు చేయటానికి ప్రతిపాదించబడ్డ ఒక పథకాన్ని ప్రభుత్వం ఆమోదించిందనీ, ఇప్పుడా పథకం అనుబంధపబడుతున్నదనీ ఉప ప్రధాని సర్దార్ పటేల్ నేడు పార్లమెంటులో ప్రకటించారు. ఈ పథకం వర్తించే కార్యాలయ ఉద్యోగులకు తగిన గడువు ఇవ్వబడ్డదని ఆయన తెలియజేశారు.

ఇతరప్రశ్నలకు సమాధానమిస్తూ ఆయన ఈ కింది విషయాలను వివరించారు

"సంస్థానాలలో ఉన్న పెద్ద భవనాలనేకం ఖాళీగా ఉన్నవి. కేంద్రప్రభుత్వ కార్యాలయాలను కొన్నిటిని ఆక్కడకు మార్చటానికి వీలుంటే మార్చవచ్చును. దానికి ఆ భవనాలు అనుకూలంగా ఉన్నదీ లేనిదీ పబ్లిక్వర్క్సుశాఖవారు పరిశీలిస్తున్నారు.

సంస్థానాధీసులు తమ సొంత ధనంతో కట్టుకున్న భవనాలూ, నివాసం చేస్తున్న భవనాలూ వారి సొంత ఆస్తులుగా పరిగణించబడుతున్నవి. మిగిలినవన్నీ ప్రభుత్వ ఆస్తులుగా పరిగణించబడుతున్నవి. మొదటిరకపు భవనాలను ప్రభుత్వం వాడుకుంటుంటే కొన్నిటికి అద్దె ఇవ్వటమూ, మరికొన్నిటి నిర్వహణ ఖర్చులనూ, మరమ్మత్తులనూ ప్రభుత్వం భరించటం జరుగుతున్నది."

విషయ వివరణ లెక్కలు

ప్రధాన విషయ వివరణలెక్కలు తయారు చేయటానికి ఏర్పాటు చేయబడ్డ సెంట్రల్ స్టాటిస్టిక్స్ కమిటీ ఈ కింది సూచనలను చేసినదని సర్దార్ పటేల్ ప్రకటించారు.

(1) రాష్ట్రాలలోనూ, జిల్లాలలోనూ ప్రాంతీయ వివరసేకరణ సంస్థలను భోర్ కమిటీ సూచనల ననుసరించి ఏర్పాటు చేయాలి.

(2) దేశమంతా వివరసేకరణ ఒకే పద్ధతిలో జరిగేట్లు ఒక పద్ధతిని నిర్ణయించాలి.

(3) కేంద్రానికి సంబంధించిన వివరాలను కేంద్ర వివరసేకరణ సంస్థ తయారు చేయాలి.

(4) విషయ వివరణలెక్కలకు సంబంధించిన ఒక రిజిస్ట్రార్ — జనరల్ను నియమించాలి.

(5) విశ్వవిద్యాలయాలు వివరసేకరణ సాగించటానికి ఎక్కువ సదుపాయాలు చేయాలి.

### పాకిస్థాన్తో వ్యాపార స్తంభన

ఇండియా రూపాయి మారకపు విలువను మార్చినప్పటినుంచీ, ఇండియా పాకిస్థానుల వ్యాపారం దాదాపు స్తంభించిపోయినదని వాణిజ్య మంత్రి నియోగి ఒక ప్రశ్నకు సమాధాన మిస్తూ వెల్లడించారు.

"విలువ మార్పునకుముందు జరిగిన వ్యాపారం తాలూకు పరిష్కారాలేకాక, మరికొన్ని ఇతర దినుసులుకూడా వస్తుమారకం పద్ధతిలోనూ, ఇతరత్రా లభించిన పాకిస్థాన్ రూపాయిలలోనూ కొద్దిగా తెప్పించబడ్డవి. పాకిస్థాన్ తన రూపాయి విలువ తగ్గించనందువల్ల ఏర్పడ్డ వివిధ సమస్యలనూ పరిశీలించటానికి ఒక సమావేశం జరిపే విషయమై ఇండియా, పాకిస్థాన్ ప్రభుత్వాల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నవి. ఇండియా వ్యాపారులు కొన్ని ముడిజనుము పాకిస్థాన్లో నిలిపివేయబడినట్లు ఫిర్యాదు లనేకం వస్తున్నవి. వ్యాపార విషయమై ఇండియా, పాకిస్థాన్లకు ఒక స్థిరమైన ఒడంబడిక అంటూ లేదు" అని ఆయన వివరించారు.

కొన్ని సందర్భాల్లో పాకిస్థాన్ రూపాయి విలువ ఇండియా రూపాయికన్నా తక్కువగా ఉన్నట్లు తాను విన్నానని ఆయన మరొక ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించారు.

### పోసఇళ్ళలో ఆస్పత్రులు

'రీమూ' పద్ధతి ననుసరించి ఆస్పత్రి భవనాల భాగాలను పోలిపోయించటానికి ఏర్పాటు జరుగుతున్నదని ఆరోగ్య మంత్రి అమృతకౌర్ వెల్లడించారు.

పొతఇళ్లను కొత్తగా కెళ్లయినవారికీ, బ్రహ్మచారులకూ చౌకగా ఇప్పిస్తారా అని అడిగ్గా సభ్యులంతా నవ్వారు.

### జాతీయాదాయం

జాతీయాదాయాన్ని అంచనా వేయటానికి ప్రభుత్వం ఒక నిపుణులసంఘాన్ని ఏర్పరిచిందని వాణిజ్యమంత్రి నియోగి వెల్లడించారు.

## కాశ్మీర్ సంఘ నివేదిక

(1-వ పేజీ తరువాయి)

అక్కడి పరిస్థితి తీవ్రం కాకుండా ఉండేలాగు భద్రతా మండలి ఉభయదేశాలను హెచ్చరించాలని కూడా వారు శిఫార్సు చేశారు.

కమిషనువారు ఇంకా ఈ విధంగా నివేదించారు.

ఇండియా పాకిస్తానులలో నూతనంగా ఏర్పడే జాతీయత కారణంగా కొన్ని స్పర్థలుండటం వల్ల కమిషనువారు జరిపిన సంప్రతింపులలో ఉభయ దేశాలు కూడా కొంత సందేహముగా; సంకోచముగా ప్రకటించి, సమస్యా పరిష్కారానికి అవసరమైన సహకారం ఇవ్వలేకపోయినవి. అయినా, ఉభయ దేశాలూ ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వం కలిగి తమ బాధ్యతలను తెలిసినవి, శాంతియుతంగా కాశ్మీరు సమస్య పరిష్కారం కావాలని కోరుచున్నవి.

ఆజాద్ కాశ్మీరు సేనలు రద్దు చేసి, సేనలను ఉపసంహరించి, ఉత్తర ప్రాంతంలో రక్షణ పరిపాలనలు ఏర్పరచడం విషయమై ఉభయ దేశాల మధ్యగల అభిప్రాయభేదాన్ని బట్టి సంధి అనేది జనవాక్య నిర్ధారణకు నాందిగా ఉండటానికి బదులు ఒక ప్రముఖ సమస్యగా పరిణమించింది.

### కమిషనుకు ఉభయ ప్రభుత్వాల సహకారం

తమ బాధ్యతలను పూర్తిగా గుర్తించగలమని ఉభయప్రభుత్వాలూ కమిషనుకు మాట ఇవ్వడంవల్ల సమస్యా పరిష్కారం కొరకు అనేక ఒడంబడికలు సాధ్యమై కొంత గ్రంథం నడిచి 1949 జనవరి 1 వ యుద్ధ విరమణ జరిగి భద్రతామండలి వారి మొదటి ఆశయం ఫలించింది. జులైలో యుద్ధ విరమణ సరిహద్దు నిర్ణయమయింది. ఈ సరిహద్దు విషయమై ఉభయ ప్రభుత్వాలూ ఘర్షణ పడకుండా రాజీపద్ధతిలో వ్యవహరించినవి. భద్రతా మండలివారు పరిశీలించమని కోరిన సంఘటనలన్నిటినీ కమిషనువారు పూర్తిగా పరిశీలించారు.

ఇండియా పాకిస్తానులమధ్య సమాధానం త్వరగా కుదరడానికి మొదటగా అడ్డపడుతూ వచ్చిన అంకాలిప్పుడు ప్రధానాంశాలుగా పరిణమించినవి.

ఆగస్టు 13 వ భద్రతామండలి చేసిన తీర్మానం అనుసరించి జమ్మూ కాశ్మీరు నిస్సైనికం కాలేదు. ఇది జరిగితేగాని జనవాక్య నిర్ధారణ సాధ్యంకాదు.

కాశ్మీరు సమస్య సంధి సమస్యగానూ, జనవాక్య నిర్ధారణ సమస్యగానూ విడగొట్టడంవల్ల సమస్యా పరిష్కారానికి దాటరాని అడ్డంకు ఏర్పడ్డది. ఆకారణంచేత కాశ్మీరు నిస్సైనికం చేసేసమస్య ఒకటిగానే పరిష్కరించబడాలి. సంస్థానంలో విశేషంగా సైన్యాలుంటే ప్రశాంత వాతావరణం ఏర్పడదు. స్వతంత్రంగా జనవాక్య నిర్ధారణ జరగాలంటే కాశ్మీరునుంచి సైన్యాలను పంపివేయాలి. కాశ్మీరుసమస్య పరిష్కారం కానిదికాదు; అది పరిష్కారం కావడం అత్యవసరం.

సంధి సమస్యలపై పరిష్కర్తృత్వం జరగడానికి పాకిస్తాను అభ్యంతరం చెప్పడము లేదు. ఐక్యరాజ్య నియమావళిలోని పరిష్కర్తృత్వ సూత్రాన్ని ఇండియా కూడా ఆమోదిస్తున్నది. కనుక ఈ విధానాన్ని అనుసరించి చూడాలి.

ఉభయ దేశాలమధ్య ఉన్నగడ్డు సమస్యలు ఆజాద్ కాశ్మీరు సేనలను రద్దుచేయడం, సంస్థానంనుండి ఉభయసైన్యాల ఉపసంహారం, ఉత్తర కాశ్మీరు కొండప్రాంతాల సమస్య, ఇతర చిల్లసమస్యలు దేశవిభజనవల్ల ఏర్పడి, సరిహద్దులూ, ఆర్థిక విషయాలనూ, మానవహక్కులనూ సంబంధించినవి. వీటికి తోడునీటి పంపకం గురించి, కాందిశీకుల ఆస్తిగురించీ కొత్త తగాదాలు ఏర్పడి, అనేక అంతరధి నిశిత సంప్రదింపులు జరిగినా పరిష్కారం కాలేదు.

### ఇండియా వాదం

1947 అక్టోబరులో కాశ్మీరు మహారాజు తన సంస్థానాన్ని ఇండియాలో చేర్చడంవల్లా, ఈ చేరికను గవర్నరు జనరలు ఆమోదించడంవల్లా కాశ్మీరు తన అధీనంలో ఉన్నట్లు ఇండియా భావిస్తున్నది. అందుచేత కాశ్మీరులో తనకు స్థానం ఉన్నది. సంస్థానంలో ప్రవేశించిన కొండజాతులవారికి పాకిస్తాను సహాయంచేయ్యడం క్రమంతప్పి, పాకిస్తాను సేనలు కాశ్మీరులో ప్రవేశించడం ఇండియాపై దాడి. కాశ్మీరులో తనసేనలను ఉంచి రక్షణసాగించడానికీ, రాకపోకలూ, విదేశ వ్యవహారాలూ కంట్రోలు చేయడానికి ఇండియాకున్న అధికారం పాకిస్తానుకులేదు. ఇండియాలో చేరిన కాశ్మీరు భద్రతకు జవాబుదారీ ఇండియాది కనుక కాశ్మీరు నిస్సైనికం చేసేటప్పుడు కాశ్మీరుకు భద్రతకు తగినంత భారతీయ సైన్యాలను ఉంచవలసి వస్తుంది. ఇండియాలో కాశ్మీరు చేరడం బలపరచడానికే జనవాక్య నిర్ధారణ.

కాశ్మీరు ఉత్తర ప్రాంతాలపై ఇండియాకు హక్కున్నదనీ, భారతీయ సైన్యాల ఉపసంహారం గురించి పాకిస్తానుతో చర్చించమనీ ఇండియా అనడం పాకిస్తానుసేనలు ముందుగా ఉపసంహరించబడాలన్న ఒడంబడికవల్లనే గాక, పాకిస్తానుసేనలు కాశ్మీరులో అడుగుపెట్టడం అక్రమమనే వాదంవల్ల కూడా సమర్థించబడుతున్నది.

సంస్థాన భద్రతకు ఇండియా బాధ్యత కలిగి ఉండటంవల్లా, అజాద్ కాశ్మీర్ సైన్యాలు ప్రభుత్వంపై తిరుగుబాటు చేసిన సైన్యాలై ఉండడంవల్లా ఈ సేనలను రద్దుచేయాలని ఇండియా కోరడం జరిగింది.

ఇండియా వాదానికి ఇన్ని ముఖ్యమంటే కాశ్మీరులో ఇండియాతోబాటు సమానమైన స్థానం పాకిస్తానుకు లేదనేది.

### పాకిస్తాను వాదం

కాశ్మీరు సంస్థానం ఇండియాలో చేరడం క్రమవిరుద్ధమనీ, అది అక్రమమని ఇండియా చేసేవాదం ఆధార రహితమనీ పాకిస్తాను వాదిస్తున్నది. 1947 ఆగస్టు 15న పాకిస్తానుతో చేసుకొన్న యథాతథపు ఒడంబడిక ప్రకారం కాశ్మీరు సంస్థానం ఏ ఇతర దేశంతోనూ ఎట్టి ఒడంబడికా చేసుకొనడానికి హక్కులేదు. కాశ్మీరు ప్రజలు తిరుగుబాటు చేసి ప్రభుత్వాన్ని ఓడించి కాశ్మీరుమహారాజును పారిపోయేలాగుచేశారు కనుక 1947 అక్టోబరు 26 న ఆయనకు ఇండియాలో చేరిక ఒడంబడిక చేసుకొనే అధికారంలేదు. ఈ చేరిక హింసాయుతంగానూ, అక్రమంగానూ జరిగింది, కనుక చెల్లనేరదు. సంస్థానంలో శాంతిభద్రతలు నెలకొనగానే కాశ్మీరు ప్రజలు కాశ్మీరు చేరికనుగురించి నిర్ణయం జరిపే వరకుమాదనే ఇండియాగవర్నరు జనరలు కాశ్మీరు చేరికను ఆమోదించడమయింది. భారతరాజ్యాంగంలో వరకుతో కూడిన చేరికకు అవకాశంలేదు. కనుక ఈ చేరికకూ, ఇండియా ప్రభుత్వం వారి ఆమోదానికీ చట్టరీత్యా ఆధారం లేదు.

మహారాజు దుష్పరిపాలనకు ఫలితంగా కాశ్మీరు ఆజాద్ ఉద్యమం ఆరంభమయింది.

కాశ్మీరులోనూ, తూర్పు పంజాబులోనూ ముసిలములపై జరిగిన అత్యాచారాల ఫలితంగా కొండజాతులవారు దాడులుచేశారు.

తన సరిహద్దులోకి ఇండియా సేనలు రావడంచేతనే పాకిస్తాను సేనలు కాశ్మీరులో ప్రవేశించవలసి వచ్చింది. భారతీయ సేనలకు భయపడి అనేకమంది శరణార్థులు పాకిస్తానులో ప్రవేశించకుండానూ, బలాత్కారంగా సంస్థానాన్నంతనూ ఇండియా స్వాధీనపరచుకో కుండానూ పాకిస్తాను చూడవలసి వచ్చింది.

కాశ్మీరు ఇండియాలో భాగమూ కాదా అన్న సమస్య తేలవలసి ఉండగానే ఇండియా కాశ్మీరు ఇండియాలోదని వాదించడం అపసవ్యమని పాకిస్తాను వాదిస్తున్నది. నిరంకుశుడైన ప్రభువు కోరికపై ఇండియా కాశ్మీరులో కలిగించుకొన్న జోక్యంకంటె కాశ్మీరు ప్రజలకు పాకిస్తాను చేసిన సహాయం చాలా దోషరహితమైనదని పాకిస్తాను వాదం.

ఇండియావాదం ఆమూలాగ్రంగా తప్పనీ, కాశ్మీరుపై తనకు ఇండియాతో సమమైన అధికారం ఉన్నదనీ, సంధివల్ల ఉభయ బలాలకూ మధ్య సామరస్యం ఏర్పడాలి కనుక ఇండియా బలాల ఉపసంహరణ వివరాలు తెలిస్తేనేగాని సంధిఒడంబడికపై సంతకం చేయదనీ పాకిస్తాను అంటున్నది.

స్థానికమైన అజాద్ సైన్యాలను రద్దుచేసే పక్షంలో అమేర సంస్థాన బలాలనుగాని కాశ్మీరులో మిగిలి ఉండే ఇండియా బలాలనుగాని రద్దు చేయాలనీ, ఉత్తర ప్రాంతంలో సంస్థాన రక్షణలు ఏర్పరచే అధికారం ఇండియాకు లేదనీ పాకిస్తాను వాదం.

### అజాద్ కాశ్మీర్ ఉద్యమం

అజాద్ కాశ్మీర్ ఉద్యమంగురించీ, 32 దళాల సాయుధ సేనలనుగురించికూడా నివేదికలో కమిషనువారు పేర్కొన్నారు.

ఈ ఉద్యమం ముస్లిములే సాగించారు. కాశ్మీరు ఇండియాలో చేరడంతో ఉద్యమం మరింతబలపడింది. సంస్థానపు పశ్చిమ ప్రాంతంలో వీరి ప్రభుత్వం స్థాపన అయింది. వీరి ఆశయం పాకిస్తానుతో చేరడంగా కనిపిస్తుంది. ఈ ఉద్యమాన్ని ఇండియా గుర్తించలేదుగాని పాకిస్తాను వారు దీనిని బాగా బలపరచి, సహాయం చేసి, అజాద్ సైన్యాలకు పాకిస్తాను సైనికాధికారులనుకూడా ఇచ్చారు. అజాద్ కాశ్మీరు ప్రాంతంలో పాకిస్తాను సైనికదళాలుండి, వారి సైన్యాలతో కలసి పనిచేసినవి. అయినా పాకిస్తాను అజాద్ కాశ్మీరు ప్రభుత్వాన్ని అధికారరీత్యా గుర్తించలేదు.

అజాద్ సేనలను రద్దుచేస్తేనేగాని ఇండియా తన బలాలలో ముఖ్యభాగాన్ని ఉపసంహరించదు. నిజానికి ప్రస్తుత అజాద్ బలాన్ని బట్టిచూస్తే, ఇండియా సేనల ఉపసంహరణ సులభమైనది కాదు.

### పర్యవసానం

పై విషయాలను బట్టిచూస్తే, అజాద్ కాశ్మీర్ సేనలను రద్దుచేస్తేగాని ఇండియా తన సేనలలో అధికభాగాన్ని ఉపసంహరించదు. ఇండియా తనసేనలను ఏవిధంగా ఉపసంహరించేదీ తనకు తెలిస్తేనేగాని పాకిస్తాను సంధిఒడంబడికపై సంతకం చెయ్యదు. ఈ విధంగా సంధి అమలు జరపడం అసాధ్యంగా పరిణమించినది.

కమిషనువారి అనుభవాన్ని బట్టి, తేలగల పరిష్కార మార్గం సంస్థానాన్ని నిస్సైనికం చేయడానికి మొదట వేసిన ప్రణాళికను మార్చాలి, కాశ్మీరులోని సైన్యాల సమస్య నంతను ఒకటిగా చూడాలి.

ఉత్తరప్రాంతం విషయమై ఇండియా చెప్పేదేమంటే, సంస్థానంలోనుంచి పాకిస్తాను సైన్యాలు తరలిపోగానే ఈ ప్రాంతాల పరిపాలనాభారం కాశ్మీరు ప్రభుత్వంపైనా, రక్షణభారం తనపైనా పడాలంటున్నారు. యీ ఉత్తర ప్రాంతాల్లో కాశ్మీరు ప్రభుత్వం బాధ్యతాయుత పరిపాలన సాగించలేదని పాకిస్తానువారంటున్నారు.

"భారత సైన్యాలు యుద్ధ విరమణ సరిహద్దుదాటి ఉత్తరంగా అడుగుపెట్టినట్టయితే తిరిగి యుద్ధం ఆరంభం కావడం తథ్యమని భావించవచ్చు." అని కాశ్మీరు కమిషనువారు తమ నివేదికను ముగించారు.

ఈ నివేదిక నేడు విడుదల అయింది. దానిపై కాశ్మీరు కమిషనుకు చెందిన అర్జెంటీనా, చెకొస్లొవేకియా, కొలంబియా, అమెరికాల ప్రతినిధులు నలుగురు మాత్రమే సంతకాలు చేశారు. ఇండియా చేసిన ఎన్నుకొనబడిన జెకోస్లొవేకియా ప్రతినిధి డా॥ ఓల్డ్రిచ్ ఖైల్ కమిషను చేసిన శిఫార్సుల క్రింద సంతకం చేయలేదు. ఆయన తన ప్రభుత్వం యొక్క ఆదేశాల కొరకు ఎదురు చూస్తున్నట్లు తెలుస్తున్నది.

కమిషనువారు రచించిన పర్యవసానాలకు బెల్జియం ప్రతినిధి ఒకనోటు తగిలించారు. కాశ్మీరు ప్రతినిధులను భారత రాజ్యాంగ పరిషత్తులో పాల్గొనే నివ్వడం గురించి పాకిస్తాను చేసిన ఆక్షేపణ ఇందులో నమోదు చేయబడింది. ఇండియా తీసుకొన్న ఈ చర్యస్థానికంగా క్రమవిరుద్ధం కానప్పటికీ, దీనివల్ల కలిగే రాజకీయ పరిణామాలు శుభకరమైనవిగా ఉండకపోవచ్చునను, అందుచేత ఈవిషయమై భద్రతా మండలిని తాను హెచ్చరించవలసి వచ్చిందనీ, జనవాక్య నిర్ధారణ జరగక పూర్వమే ఇండియా ప్రభుత్వంవారు ఎన్నికల ద్వారాగాని కాశ్మీరు ప్రజలతో సంప్రతించిగాని కాశ్మీరు ప్రజలకు రాజ్యాంగం ఏర్పాటు చేయడం అతి ప్రమాదకరమనీ బెల్జియం ప్రతినిధి ఈ నోటులో వివరించారు.

## బాజ్పాయి ప్రకటన

లండన్, డిసెంబర్ 12: భద్రతా మండలి ముందు కాశ్మీర్ సమస్య చర్చకు వచ్చిన తరుణంలో, ఐక్యరాజ్య సమితి యీ సమస్యనంతా మొత్తంగా స్వీకరించి ఐక్యరాజ్యసమితి మధ్యవర్తిత్వంద్వారా పరిష్కరించదలిస్తే భారతదేశానికి యే విధమైన అభ్యంతరమూ లేదని, భారత విదేశాంగ శాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్పాయ్ ఈ పేళ యిక్కడ పత్రికా విలేఖరులకు తెలియజేశారు.

బాజ్పాయ్గారూ, హెచ్. వి. భార్గావు ఈ పేళ యిక్కడినుంచి బయలుదేరి న్యూయార్కు వెళ్ళారు. డిసెంబర్ 17,19 తేదీలలో, కాశ్మీరు కమిషన్ నివేదిక భద్రతామండలి ముందు చర్చకు వచ్చినప్పుడు వీరు భారతదేశం తరపున ఆ చర్చలో పాల్గొంటారు. కమిషన్ నివేదికను ప్రాతిపదికగా తీసుకుని భద్రతా మండలి కాశ్మీర్ తగాదాను విచారించబోతున్నది. అభిప్రాయాలకూ ఇప్పటి మాధ్యక్షానికీ తేడా యేమీలేదు' అన్నారు.

నెహ్రూగారు యీవిషయమై ఇటీవల లండన్లో చేసిన ప్రకటనలో 'యీసమస్య తొందరగా పరిష్కారమైపోవాలంటే, మధ్యవర్తిత్వం మినహాయించి గత్యంతరం లేదు. అలాంటి సాధకాలం లేకపోతే యుద్ధం కొనసాగవలసి వస్తుంది. అది భ్రాంతికారానికి యిష్టంలేదు; లేదా యిదే ప్రతిష్టంభన సాగుతూ వుండవలసి వస్తుంది; అది శాశ్వత పరిష్కారానికి యేవిధంగానూ సాయపడదు' అన్నారు.

మధ్యవర్తిత్వ సూత్రాన్ని బలపరుస్తూ బాజ్పాయ్ ఇలా అన్నారు:- మధ్యవర్తిత్వమంటే, ఈ సమస్యను యావత్తూ సమగ్రంగా తీసుకుని మొత్తంగా పరిష్కారమయ్యేటట్టు చూడాలి. అంతేగాని, సైనిక ఉపసంహారమునో, వేరో, ఇలాంటి అసమగ్ర పరిష్కారాలవల్లా మధ్యవర్తిత్వాలవల్లా లాభంవుండదు' అన్నారు.

## షేక్ అబ్దుల్లా

న్యూఢిల్లీ, డిసెంబర్ 13: శేక్ సక్సేనా జన్మదినమిత్తం కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా ఈ పేళ ఢిల్లీనుంచి బొంబాయికి బయలుదేరారు. ఆయన భద్రతా మండలిలో రానున్న కాశ్మీర్ చర్చలో పాల్గొనబోతున్నారు. ఆయన వెంట, కాశ్మీర్ ప్రభుత్వ ప్రచారశాఖా ప్రధానకార్యదర్శి యస్. జస్టీకూడా వున్నారు.

## డా॥ సి. ఆర్. రెడ్డిగారికి పూర్తిజీతంవీ. దసెలవు

### ఇవ్వటం క్రమ విరుద్ధంకాదని ఆంధ్ర సెనేట్ నిర్ణయం

విశాఖపట్నం, డిసెంబరు 10: ఆంధ్ర విశ్వకళాపరిషత్తు మాజీ వైస్‌ఛాన్సెలర్ అయిన కట్టమంచి రామలింగారెడ్డిగారికి పూర్తి జీతంతోసహా సెలవు ఇవ్వటం అన్యాయం, క్రమ విరుద్ధంఅని నిన్న జరిగిన పరిషత్ సెనేట్ సమావేశంలో వి. సీతాపతిరావుగారు ఒక తీర్మానం తెచ్చారు.

వైస్‌ఛాన్సెలర్ డా॥ వి. ఎస్. కృష్ణ అధ్యక్షత వహించారు.

జీతంతోసహా సెలవుతీసుకుని మైసూరు విశ్వకళాపరిషత్తు ప్రోవైస్‌ఛాన్సెలర్ పదవిని డా॥ రెడ్డిగారు స్వీకరించటంకూడా క్రమ విరుద్ధమనీ, రెడ్డిగారికి సెలవును ఇవ్వడంలో సిండికేటు అనుచితంగా ప్రవర్తించిందనీ సీతాపతిరావుగారు తీర్మానం ప్రతిపాదించగా కె. సర్వేశ్వరశాస్త్రిగారు బలపరుస్తూ మాట్లాడారు.

సిండికేటు ఈ విషయాన్ని పూర్తిగా చర్చించినమీదటే నిబంధనల ప్రకారం డా॥ సి. ఆర్. రెడ్డిగారికి డిసెంబరు 7 వరకూ పూర్తిజీతంతో సెలవును ఇచ్చిందని డా॥ వి. ఎస్. కృష్ణ అన్నారు.

చర్చలో కలుగజేసుకొని మద్రాసు అర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు ఇదివరలో ఇలాంటి సంఘటనలు అనేకం న్యాయసమ్మతంగా జరిగాయని ఉదాహరణలతోసహా డా॥ కృష్ణగారిని సమర్థించారు.

తీర్మానానికి వ్యతిరేకిస్తూ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు అమూల్యమైనసేవను చేసిన డా॥ రెడ్డిగారిపట్ల యిట్టి అమర్యాదను చూపటం గర్హనీయమని డా॥ ఎ. కృష్ణస్వామిగారు, ఇంకా పలువురు ప్రసంగించారు. సీతాపతిరావుగారు తమ తీర్మానం ఉపసంహరించుకోనందున ఓటింగుకు పెట్టగా 2 ఓట్లు అనుకూలంగాను, మిగతా ఓట్లు ప్రతికూలంగాను వచ్చి తీర్మానం వీగిపోయింది.

ఈ తీర్మానమును పరిషత్తు రికార్డులలో చేర్పకుండా పూర్తిగా తొలగించివేయవలెనని డా॥ కృష్ణస్వామిగారు తీర్మానం ప్రవేశపెట్టగా, ఈ చర్య మరీ తీవ్రంగా వున్నదని సర్వేశ్వరశాస్త్రిగారు విమర్శించారు. ఓటుకుపెట్టగా మస్తుగమాత్రమే వ్యతిరేకంగా వోటు చేసినందున తీర్మానం నెగ్గింది. (స్వ. వి.)

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 15 గురువారం

### మద్రాసు (ఎ)

7-0 స్వాగతము. 7-30 పి. రఘుపతి 8-15 ఉదయగానము (రి) 8-30 'బి' వలె 1-( 'బి' వలె 1-40 సినీమా రికార్డులు 2-10 'బి' వలె 2-45 కదంబము (రి) 5-30 ఎస్. కె. దొరస్వామిపిళ్ల 6-10 స్థానిక ప్రకటనలు వగైరా. 6-20 ఎస్. ముత్తుమీనాక్షి. 7-0 వాయులీనం నిలయ విద్వాంసులు 7-30 గీతమంజరి (రి) 7-45 'బి' వలె 8-15 టి. ఎస్. స్వామినాథపిళ్ల 8-30 ఢిల్లీ వలె 8-40 టి. ఎస్. స్వామినాథపిళ్ల 9-15 విజయవాడ వలె 9-30 (బి) వలె. 10-0 పాశ్చాత్య సంగీతము. (రి)

### మద్రాసు (బి)

7 వార్తలు; 7-15 చూడామణి (రి) 7-45 (ఎ) వలె; 8-30 కె. వి. రామస్వామయ్యర్ వయొలిన్; 12 కార్మికులకు; 12-30 మిడిల్ స్కూళ్ళకు; 1-మహిళామండలి; 1-30 (ఎ)వలెను; 1-50 వార్తలు; 2 ఢిల్లీబా నిలయ విద్వాంసుడు; 2-15 హైస్కూళ్ళకు; 2-45 (ఎ) వలె; 4 ఎలిమెంటరీ స్కూళ్ళకు; 4-30 (ఎ) వలె; 5-30 (ఎ) వలె; 6-20 సాయం సంగీతము (రి); 6-30 గ్రామస్థులకు; 7 వార్తలు; 7-15 గ్రామస్థులకు; 7-45 నేటి విద్యాభ్యాస సమస్యలు: ప్రసంగము: మామిడిపూడి వెంకటరంగయ్య; 8 కర్నాటకళ జానపదగేయాలు; 8-15 (ఎ)వలె; 9-30 ఎస్. రామస్వామి; 10 సినిమాపాటలు (రి).

### విజయవాడ

ఉ॥ 7 వార్తలు. 7-15 వి. వి. శతకోపన్(రి). 7-30 వి. జేవీ వయొలిన్. 8-15 తేనువు, క్లారినెట్, నిలయ విద్వాంసులు. 8-30 ఉప్పలపాటి లక్ష్మీనారాయణ. 12-30 మిడిల్ స్కూళ్ళకు. 1 తారాపథము 1-40 వాద్యసంగీతము. 1-50 వార్తలు 2 గానసుధ (రి). 2.15 హైస్కూళ్లకు. 4 ఎలిమెంటరీ స్కూళ్లకు. 5-30 ఉప్పలపాటి లక్ష్మీనారాయణ. 6-10 స్థానిక ప్రకటనలు వగైరా. 6-20 గీతమంజరి (రి). 6-30 గ్రామస్థులకు 7 వార్తలు. 7-15 గ్రామస్థులకు. 7-20 ఓ. నకిల. 7.45 కవి, కావ్యము—అక్కిరెడ్డి సత్యనారాణ స్వీయకావ్యపఠనం. 8 వాహిని—సంగీతరూపకం—నార్ల చిరంజీవి. 9-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 9-30 ఢిల్లీ వలె. 9-40 కల్పలత—గోపాలు ఫోరిక రికార్డులు. 9-15 కాశ్మీరుపై వి. వెంకట్రామన్ గారి ప్రసంగం. 9-30 వి. జేవీ వయొలిన్.

### హైద్రాబాదు

7-30 బాపూరావ్; 7-45 మహమూద్ బేగ్; 8-20 కె. నవనీతం; వీణ, గాత్రం; 8-50 వార్తలు; 9-15 మూర్జహాన్ బేగం; 12-30 నిశాళ (రి); 1-ప్రణయమహిమ (రి); 1-40 వాద్య సమ్మేళనం(రి); 1-50 వార్తలు, 5-బాపూరావ్; 5-2 నూర్జహాన్‌బేగం; 5-35 మహమూద్ బేగ్; 6-30 గ్రామస్థుల కార్యక్రమం; 7-వార్తలు; 7-15 గ్రామస్థుల కార్యక్రమం; 7-55 మహమూద్ బేగ్; 8-30 కె. నవనీతం; 9-15 బాపూరావ్; 9-30 నూర్జహాన్‌బేగం; 9-55 మహమూద్ బేగ్; 10-10 నూర్జహాన్ బేగం; 10-30 "ముంతాజ్ కాజ్ గానే" (రి).

## హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లుపై పార్లమెంటు చర్చ

### సంతానంగారి సమర్థన

న్యూఢిల్లీ, డిశంబరు 12: హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లునుగూర్చి నేను పార్లమెంటులో చర్చ ప్రారంభమయ్యే వేళకు ఒక వెయ్యిమందికిపైగా జనం వ్యతిరేక నినాదాలు చేస్తూ పార్లమెంటు భవనాన్ని చుట్టుముట్టారు, ఇందులో స్త్రీలు పురుషులు చాలామంది వున్నారు.

పార్లమెంటు భవనానికి వచ్చేగేట్లమీద వీరు గుమిగూడి రాకపోకలకు అడ్డు కల్గించకుండా చేసేనిమిత్తం ఢిల్లీ సాయుధ రక్షకభట దళాన్ని పిలిపించవలసివచ్చింది.

ప్రాటిక్కనకొర్డ్ ప్రదర్శకుల సంఖ్య ఎక్కువకావటం ప్రారంభించింది. ఒక రోడ్డునుంచి ఇంకోరోడ్డు వారు కదలటం ప్రారంభించారు. పోలీసులుకూడా వారి వెంట పోక తప్పిందికాదు. ఎట్లాఅయితే నేమి ఎక్కువ బలప్రయోగాన్ని చేయకుండానే పోలీసులు రోడ్లమీద వీరు గుమిగూడకుండా చూడగలిగారు.

పండిట్ గోవిందమాలవీయా ఈ జనాన్ని శాంతంగా తిరిగి పోవలసిందిగా కోరారు. ఆయన ఈ బిల్లును తీవ్రంగా ప్రతిఘటిస్తున్న వారిలో ఒకరు.

కాని ప్రదర్శకులు కదిలినపాపాన పోలేదు. పార్లమెంటు సమావేశం ముగిసే దాకా తిరుగుతూనేవున్నారు.

కరి పార్లమెంటు సమావేశంలో పండిట్ ముకుందా బీహారీలాల్ భార్గవా ఈ బిల్లుమీద సగం మాట్లాడారు. తక్కిన సగాన్ని నేడు పూర్తిచేశారు. ఈ బిల్లువల్ల హిందూకుటుంబ జీవనం నాశనమైపోతుందని ఆయన అన్నారు. అందువల్ల ఈ బిల్లు కొత్త పార్లమెంటు ఎన్నిక అయ్యేదాకా వాయిదావేయాలని ఆయన కోరారు. ఈ పార్లమెంటు ఈ బిల్లును శాసనంగా ప్రకటించవచ్చుగాని, వయోజన ఓటింగు పద్ధతిమీద ఏర్పడే పార్లమెంటుకు వున్నంత అధికారం దీనికి వుంటుందని నేను భావించడంలేదు. అట్లాగే ప్రధాని అన్నట్లు, ఈ బిల్లు అతిముఖ్యమైనదని చాలా స్పష్టంగా వున్నదనిగూడా నేను భావించడంలేదు. అని పండిట్ భార్గవా అన్నారు. దాయభాగం విషయంలోనూ, వివాహాల విషయంలోనుకూడా పండిట్ భార్గవా తన అసమ్మతి వెల్లడిచేశారు. అమెరికా, బ్రిటన్‌వంటి పాశ్చాత్యదేశాలే విడాకులతో విసిగి, దాన్ని సంస్కరిద్దామని చూస్తుంటే, ఇప్పుడు ఈ బిల్లుతో దాన్ని భారతదేశం నెత్తిన రుద్దటం ఏమంత సమంజసంగా వున్నదని ఆయన ప్రశ్నించారు.

హిందూధర్మం ఎక్కడో ఆకాశం నుంచి ఊడిపడింది కాదు. సమాజమంతా శాసనసభగా ప్రవర్తిల్లి దానికి ఒక రూపాన్ని దిద్దుతూ వస్తూవుంది. ఇది అనాదిసిద్ధంగా వస్తూ, ఎన్నో తాకిడులను తట్టుకున్నది. నిజానికి ఇండియా అంటే అలహాబాదులో లేదు. అది బహు సంఖ్యాకములైన గ్రామాల్లో వుంది దాన్ని గుర్తించకుండా తెచ్చిన ఈ బిల్లును నా శక్తి అంతటితోనూ ప్రతిఘటిస్తాను అంటూ ఆయన తన ఉపన్యాసాన్ని ముగించారు.

శ్రీ కె. సంతానం బిల్లును సమర్థిస్తూ మాట్లాడారు. ఆయన మాట్లాడుతున్నప్పుడు చాలామంది అడ్డుప్రశ్నలు వేశారు. కాని ఆయన వాటి అన్నింటిని తట్టుకుంటూ తన ఉపన్యాసాన్ని సాగించారు. ఈ బిల్లు మనం తెస్తున్నందుకు ఎక్కడో పరలోకాల్లో వున్న మన పూర్వీకులు ఎంతో ఆనందిస్తూ వుంటారు. రాజ్యాంగంలో గాని, ఈ బిల్లులోగాని, మనం చేస్తున్న పని అల్లా ఈ దేశంలో అధిక సంఖ్యాకులు బలపడి, పూర్వం వున్న ఎనుకు దిబ్బల నన్నింటిని సద్దుబాటు చేసుకొని ఏకమత్యంతో వుండడానికే ఏర్పాటు చేయబడినాయి.

అందువల్ల ఇప్పుడు ఈ బిల్లును వ్యతిరేకించడమేపనిగా పెట్టుకున్న వాళ్లంతా తమ అభిప్రాయాల తిరుగా పరిశీలించుకొని, దీన్ని బలపరచగలరని భావిస్తున్నాను అని అంటూ, ఈ బిల్లులో హిందూధర్మం అంతా వర్తమానకాలానికి అనుగుణంగా పాదుకొల్పబడిందని, సమాజంలో శాంతియుతమైన విప్లవాత్మక పరివర్తనను నాటడమే దీని ఆశయమని అన్నారు.

శ్రీ సంతానం ప్రసంగిస్తున్న సందర్భంలో సభ్యులు అనుమానాలు వేసిన ప్రశ్నలు, వాటికి ఆయన సమాధానాలలో కొంత విపరీతధోరణి గోచరమయ్యే సరికి అప్పుడు సభాధ్యక్షత వహించివున్న శ్రీ అనంతశయనం అయ్యంగారు సభ్యులను అసలు విషయాలకు వదిలి చిల్లర విషయాలలో పడవద్దని హెచ్చరించవలసి వచ్చింది.

పండిట్ భార్గవా ఒక ప్రశ్న వేసే సరికి సర్ బి. ఎన్. రావు పండిట్ భార్గవాకన్నా ఎక్కువ తెలిసినవాడేనని శ్రీ సంతానం అన్నారు. అప్పుడు పండిట్ మైత్రా కల్పించుకొని: సర్ బి. ఎన్. రావు మీకు దేముడైతే కావచ్చును. మేమిక్కడ వారిస్తే వినడానికి వున్నాముగాని ఇటువంటి అసందర్భపు ప్రసంగం వినడానికి లేము అనిఅన్నారు. అప్పుడు శ్రీ అయ్యంగారు కలుగజేసుకొన్నామీద పండిట్ మైత్రా తన మాటలను ఉపసంహరించుకొన్నారు.

రోహిణీకుమార చౌదరి:—హిందూధర్మానికి మతానికి అతి సన్నిహితమైన సంబంధంవుంది. హిందువుకాని ఒకడు ధర్మాన్ని ఈ విధంగా నిబద్ధంచేయడం, సహించరాని విషయం.

అయ్యంగారు:— బిల్లుమీద చర్చలో ఉద్వేగం పనికిరాదు. మీరెంత గాఢమైన స్కూలమని ఈ బిల్లును వ్యతిరేకిస్తూవున్నారో, బిల్లును సమర్థించేవారుకూడా అంతే గాఢమనస్కులమనుకుంటున్నారు. అందువల్ల ఇప్పుడు అంతా వాదోపవాదాలను సావధానంగా వినాలి.

కృష్ణస్వామిభారతి: శ్రీ సర్ బి. ఎన్. రావు హిందూయే. ఆయన్ను హిందువు కాదనడాన్ని సహించం.

అయ్యంగారు:— ఏ వ్యక్తి ఏ మతానికి చెందినవాడు అన్నది కాదు. ప్రస్తుతాంశం. సభ్యులు. ఒకరిని ఒకళ్లుగాని, ఇతరులనుగాని న్యూనపరచడం పనికిరాదు.

సంతానం: ఇప్పటివున్న హిందువులంతా ఏమాత్రం హిందువులో, సర్ బి. ఎన్. రావుకూడా అమాత్రం హిందువే. అయినా ఇటువంటి ఎత్తులను గుర్తిస్తామని ప్రతిపక్షులు భావిస్తే, వారు పొరబడ్డారని చెప్పవలసివుంది.

రాంనారాయణ్ సింగ్: మీరు లాతీలు వున్నాయిగా:

సంతానం: మా పూర్వులు చాలా చాందసులు. కొన్ని తరాలుగా మా యిండ్లలో చేపలుకూడా తినిఎరగం.

కామత్: చేపలు తినకపోవడం చాందసత్వానికి ఒక లక్షణమా?

సంతానం: మా ప్రాంతంలో చేపలు తినడం ఆచారవిరుద్ధంగా భావిస్తారు.

మైత్రా: మా ప్రాంతంలో ఇడ్డెన్లు తినడం ఆచారవిరుద్ధం.

అయ్యంగారు: మనం ఇడ్డెన్లను గురించీన్నీ, చేపలను గురించీన్నీ కాదు మాట్లాడవలసింది; బిల్లునుగురించి, దాంట్లోవున్న ముఖ్యవిషయాలను గురించీన్నీ.

అనంతరం తిరిగి తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ, మన వాళ్ళకు చాలా మందికి హిందూధర్మం బ్రిటిష్‌వాళ్లు వ్యాఖ్యానం చేసిందే కళ్ళకు కనపడుతుందిగాని, ఇంకోటి కడపటంలేదన్నారు. అదీకాకుండా ఆవ్యాఖ్యానాల్లో బ్రిటిష్ న్యాయమూర్తులు మనువుకు, యాజ్ఞవల్క్యునికి వ్యతిరేకంగానడిస్తే, ఈ పార్లమెంటు కూడా అట్లానడవడంలో వున్న నష్టమేమిటని ఆయన ప్రశ్నించారు. ఇంతమంది ఇంతింతసేపు ఈ బిల్లునుగూర్చి ప్రసంగించారుగాని, ఏక పత్నీత్వం మంచిదా? చెడ్డదా? అన్న విషయాన్ని ఎత్తుకోకపోవడం ఆశ్చర్యంగా వున్నదనే వరకు పండిట్ మైత్రా అందుకొని, అది నూతనా వివాసంగానే కనపడుతోంది అని ఎత్తిపొడిచారు.

సంతానం: కొంతమంది ఇద్దరు పెళ్ళాలను చేసుకోవాలనే ఆశ వుంచుకుంటున్నారు. అట్లాచేసుకుంటున్నారుకూడా. కొంతమంది అట్లా చేసుకునే వీలువుందని కలలుగంటూవున్నారు. ఆర్యఋషులు ఏకపత్నీత్వాన్ని అంగీకరించారుగాని, అది తెలిసీ, ఇంకోమార్గాన్ని చూపలేకపోయారు. మనం దాన్ని సరిచేయాలి. విడాకులతో అది సాధ్యమవుతుంది. అదీ కా

## ఫ్రెంచి ఇండియాలో జనవాక్య నిర్ధారణ

### ఫ్రెంచి-భారత ప్రభుత్వాల ఒప్పందం!

పుదుచ్చేరి, డిసెంబరు 12: ఫ్రెంచి భూభాగములను భారతయూనియనులో లీనముచేయు సమస్యపై నిర్ణయించుటకు జనవాక్యములో రిజిస్టర్డు వోటర్లలో 100కి 51 వంతులు పాల్గొన్నయెడల అది సక్రమమైన జనవాక్యమగునని ఫ్రెంచి భారత ప్రభుత్వములు వారయిదివరకే ఒప్పందము చేసికొన్నట్లు విశ్వసనీయమైన వర్గముల ద్వారా తనకు తెలియవచ్చెనని ఫ్రెంచి ఇండియా సోషలిస్టుపార్టీ నాయకుడును, ఫ్రెంచిఇండియా ప్రభుత్వ పరిపాలన సంఘములో సభ్యుడును అగు ఎడుగర్డు గోబర్టు నేడు చెప్పెను.

వోటర్లు 100కి 60 మంది పాల్గొన్నగాని అది సక్రమమైన జనవాక్యము కాదని ఫ్రెంచివారు సూచించినట్లు ప్రకటితమైన వార్తవిషయమై మదుగగాదాని విషయమై వ్యాఖ్యానించ గోబర్టు నిరాకరించెను. రిజిస్టర్డు వోటర్లలో 100కి 51 వంతులు పాల్గొన్నయెడల అది సక్రమమైన జనవాక్యమని ఉభయ ప్రభుత్వములు ఒప్పందము చేసికొన్నట్లు తనకు తెలిసెననెను.

కుండా ఈ బిల్లుసలహరావ్వత్నిగూడా రద్దు చేసి వేస్తున్నది

మైత్రా: కులం అంటూ లేకపోతే, ఇంకా హిందువు అంటే ఎవరు?

సంతానం: కులధర్మంలో హిందూమతం గాఢసంగా తయారయింది. మనం హిందువులం కాకుండా అన్నా పోవాలి, లేదా కులధర్మరహితమైన హిందూమతాన్ని నెలకొల్పాలి. ఇంతకన్నా ఇంకోమార్గం లేదు.

సాహు: అట్లా అయితే మహమ్మదీయులుగూడా హిందువులే.

సంతానం: భగవద్గీతను, వేదాంత మార్గాన్ని అంగీకరించిన రోజున ముస్లింలను కూడా హిందువు లనడానికి నాకేమీ అభ్యంతరం లేదు

సమాజంలో తీవ్రపరివర్తనానికి దారితీసే, ఈ బిల్లును ఇప్పుడు ప్రవేశపెట్టడం అంత ఉచితంగా కనపించడంలేదని శ్రీ హెచ్. వి. పటాస్కర్. అన్నారు. ప్రజలకు అన్నవస్త్రాలు ముందుకావాలిగాని, పెళ్లి, ఆస్తి, వాళ్లకిప్పుడు అంత ముఖ్యంకాదు అనికూడా ఆయన స్పష్టంచేశారు. ఈ బిల్లుకు నేను అంత వ్యతిరేకినికాదుగాని, స్వాతంత్ర్యం ఆ భాగాన్నూ వల్ల, దేశంలో హిందువులకు, పార్సీలకు, ముస్లింలకు అందరికి అనువర్తించే బిల్లును తెస్తే ఎంతో సంతోషించి వుండేవాడిని అని ఆయన అన్నారు.

శ్రీ రాంసహాయ్ మాట్లాడుతూ, ఈ బిల్లుకు తాను వ్యతిరేకుణ్ణి కాకపోయినా, ప్రతిపక్షుల అభిప్రాయాలకు తగిన విధంగా దాన్ని కొంచెం మార్చడం అవసరం అని సూచించారు.

శ్రీ కృష్ణచంద్ర శర్మ బిల్లును సమర్థించారు. ఈ బిల్లువల్ల హిందూసభ్యత నాశనమౌతుందని కొంతమంది సభ్యులు వెలిబుచ్చిన అభిప్రాయంతో ఆయన ఏకీభవించలేకపోయారు. క్రమపరిణామమనేది వుందిగాని, సభ్యతను సభ్యత అనేందుకే వీలులేదు. హిందూ సభ్యత ఎప్పుడూ క్రమపరిణామాన్ని పొందుతూనే వచ్చింది. అందువల్ల సభ్యులను కొంచెం శాస్త్రీయ దృక్పథంతో ఈ బిల్లు విచారించి, సమర్థించవలసిందిగా ఆయన కోరారు.

ఆస్తి వారసత్వం విషయంలోకూడా మగపిల్లలు, ఆడపిల్లలు, సమభాగ స్వామ్యాన్ని పొందడం తనకెంత హిందూ ధర్మ విరుద్ధంగా కన్పించడంలేదనికూడా ఆయన అన్నారు.

శ్రీ బి. ఎ. గుప్తాగూడా బిల్లును సమర్థించారు. 'కాని బిల్లులో ఆస్తి పంపకం విషయమైవున్న అంశాలనుగూర్చి ఇప్పుడు తొందరపడవలసిన అవసరంలేదని, దేశంలో పరిస్థితులు బాగుపడిన తరువాత వాటి విషయం చూచుకోవచ్చునని ఆయన అన్నారు.

కరుణాకరమీనన్ మాట్లాడుతూ, ఈ బిల్లులో ఆస్తిపంపకం విషయం వ్యవస్థలో పితృస్వామ్య వ్యవస్థ ప్రాతిపదికగా తీసుకోబడిందని, మాతృస్వామ్య వ్యవస్థకు స్థానం లేకుండా పోయిందని విమర్శించారు.

శ్రీ సీతారాంజాజూ బిల్లు బలపరిచారు. ఈ బిల్లులోవున్న వారసత్వం, ఆస్తిపంపకం వాటా, మొదలయిన విషయాలే ప్రతిపక్షులను కలతపెడుతున్నట్లు తాను విన్నాననీ, అదీకాకుండా వీరి అంధగా మార్వాడీలు నిలబడిన బాధలుగూడా కన్పిస్తున్నాయని ఆయన వెల్లడిచేశారు. బ్రిటిషువారు ఎప్పుడు పెట్టుబడిదార్లను వెనకవేసుకుంటూ వచ్చారు. ఇప్పుడు ఇది ఆ పెట్టుబడిదార్లకు తగిలేటప్పటికి నొప్పి కలిగింది అనికూడా ఆయన అన్నారు.

ఇంతటితో పార్లమెంటు సమావేశం ముగిసింది. తిరిగి రేపు చర్చ జరుగుతుంది.

## ప్రపంచములో శాంతి స్థాపనకు మార్గం

### లార్డుబాయిడ్ ఆర్ సూచన

ఆస్లో, డిసెంబరు 12: ప్రపంచములోని వివిధ దేశములు యుద్ధసన్నాహములకై తాము ఉపయోగించుచున్న ద్రవ్యములో నూరవ పాలును ప్రత్యేక ప్రాతినిధ్యముకల ఐక్యరాజ్యసమితి సంస్థలకు యిచ్చేయెడల శాంతిస్థాపనకుగల ఆటంకములు అదృశ్యములగునని బ్రిటిష్ శాస్త్రజ్ఞుడును ప్రపంచ ఆహారశాస్త్రజ్ఞుడును అగు లార్డు బాయిడ్ ఆర్ ఈ సంవత్సరపు నోబెల్ శాంతి బహుమానమును పొందిన మహనీయుడు నేడిచ్చట చెప్పెను. పాత నానాజాతిసమితికంటె ఐక్యరాజ్యసమితి ఉత్తమమైనసంస్థయని లార్డు బాయిడ్ఆర్ చెప్పుచు యిట్లనెను: "శాస్త్రజ్ఞానమును వర్తింపజేయుటకు ఐక్యరాజ్యసమితివారు ప్రవీణులతోకూడిన సంస్థల నేర్పరిచియున్నారు. ప్రపంచ బ్యాంకునుగూడ వారు యేర్పరచియున్నారు. ఈ సంస్థలకు ద్రవ్యము తక్కువగానున్నది అది కారణముకానక్కయు. ఈ సంస్థలను అంటిపెట్టుకొనియున్న 60 ప్రభుత్వములు, పరస్పర సహకార ఆశయముతో నోటిమాటలతో సమర్థించిన ఈ 60 దేశములు యుద్ధసన్నాహములకు తాము వినియోగించుచున్న ద్రవ్యములో నూటికి ఒకవంతు గనమును ఈ సంస్థలకు యిచ్చేయెడల కొద్ది సంవత్సరములలో వివిధ దేశములను వేరుచేయుచున్న రాజకీయపు సమస్యలు నిరర్థకములగునని యు, శాంతిస్థాపనకుగల ఆటంకములు అదృశ్యములగునని యు ధైర్యముగా చెప్పగలను."

నోబెల్ శాంతిబహుమానమును పొందినవారు ఒసంగవలసిన ఉపన్యాసమును ఐక్యరాజ్యసమితి ఆహార, వ్యవసాయ సంస్థ మాజీ డైరెక్టర్ జనరల్ లార్డు బాయిడ్ఆర్ యిచ్చట ఒసంగుచు పైవిధముగా చెప్పెను. గత శనివారము ఆయన ఈ బహుమానము స్వీకరించెను.

### ప్రపంచము శాంతి కోరుచున్నది

ప్రపంచములో శాంతి యేర్పడవలెనా? లేక యుద్ధము జరగవలెనా? అను విషయము వివిధదేశముల ప్రజల నిర్ణయముపై ఆధారపడి యుండునని, నియంతృత్వ దేశములలోగూడ నాయకులు తాను నైకొనుచర్యలను ప్రపంచము రొదుకుట సమర్థించుకొనవలసి యున్నదని లార్డు బాయిడ్ ఆర్ చెప్పెను. జనవాక్యము నైకొన్నయెడల ప్రపంచములో యుద్ధమునకు వోటుచేయు ఒక్కనికి వేయిమంది శాంతికై వోటు చేయుదురని ఆయన చెప్పెను. వివిధ అంతర్జాతీయ సంస్థలు ప్రపంచ ఫెడరల్ ప్రభుత్వ వ్యవస్థముగులో కలిసి పనిచేయుచున్నవని, ప్రపంచ ప్రజలందరును కలిసి ఐక్యకంఠమున శాంతి కావలెనని, ఐక్యము కావలెనని కోరేయెడల శాంతి తప్పక యేర్పడునని ఆయన చెప్పెను. వివిధ సామ్రాజ్యములు పోటీ పడుచుండగము గతించినదనెరి. శాస్త్రజ్ఞానము ఘోరమైన మరణాస్త్రములను ఉత్పత్తి చేసినదని, ఈ మరణాస్త్రములతో జరుగు యుద్ధములో జయించువారు దుండరని, ఓడువారుండరని, జయించినవారు ఓడినవారుగూడ నాశనమగుదురని లార్డు బాయిడ్ఆర్ చెప్పెను.

పూర్వ ఆయుధము లన్నిటికంటె ఆటంబాంబు ఘోరమైనదని ఆయన చెప్పెను. మానవకోటికి ఈ గ్రొత్తశక్తులు కలిగియుండగా తమకు హక్కులు కావలెనని, తమకు రాజకీయ స్వాతంత్ర్యము కావలెనని, తమ జీవిత ప్రమాణము తెల్లజాతివారి జీవిత ప్రమాణముతో సమానమైనదిగా నుండవలెనని రంగుజాతులవారు కోరుచున్నారని ఆయన చెప్పెను. సెంరట ఐరోపాఖండములో ప్రారంభమై అనేక మార్పులు తెచ్చిపెట్టిన వ్యక్తి హక్కుల ఉద్యమము రంగుజాతి వారిలో వ్యాపించిన దనెరి. యుద్ధము సమాప్తియైన తరువాత ప్రపంచములో సరకులు తక్కువగా నుండెను. కాని యిప్పుడు ఈ కొరతతీరెను, వివిధ దేశములవారు, మార్కెట్లకై పోరాడుచున్నారు. జర్మనీ జపానులు యుద్ధమునకు పూర్వము తాము ఎగుమతి చేయుచున్నదానికంటె యెక్కువ ఎగుమతి చేయుశక్తి సంపాదించుకొన్నప్పుడు యేమగును? పైనా మున్నగు దేశములు, అమెరికనుల యొక్కయు ఐరోపియను వర్గముల యొక్కయు జీవిత ప్రమాణము కంటె తక్కువ జీవిత ప్రమాణముతో సంతృప్తిపడు చైనా మున్నగుదేశములు పారిశ్రామిక దేశములై ఎగుమతి మార్కెట్లకై పోటీలో చేరినప్పు డేమగును? జీవికకు అత్యవసరము కావలసిన వస్తువులు లభ్యము కాకపోవుటచేత ప్రతి ముగ్గురిలో యిద్దరు అకాల మరణము వాత బడుచున్నారు. ఆసియా విప్లవమునకు కారణము ఆకలిబాధ, దారి

ద్ర్యమే ఈ విప్లవము రంగుజాతుల వారిలో గూడ వ్యాపించవచ్చును. నానాజాతి సమితి స్థాపనోద్దేశ్యములు చాలా మంచివే. నానాజాతి సమితి దాదాపు జయప్రదమగునట్లు నూడా. కాని ఐరోపాయందలి వివిధదేశములవారు స్వార్థతత్పరులైరి. ఆర్థికవిషయములనుగూర్చి ఆలోచించుటకు బదులు రాజకీయ విషయములకు విపరీత ప్రాముఖ్య మొసంగిరి' అని లార్డు బాయిడ్ఆర్ చెప్పెను.

## పార్లమెంటులో 122 స్థానాలకు ఉపఎన్నికలు

### జనవరిలోగా ముగించ నిశ్చయం

న్యూఢిల్లీ, డిసెంబరు 12: కేంద్రంలోనూ, రాష్ట్రశాసనసభల్లోనూ ఎవరికీ ద్వంద్వ సభ్యత్వం వుండరాదని నూతన రాజ్యాంగం నిర్ణయించటంవల్ల భారత పార్లమెంటులో రాష్ట్రాలకు సంబంధించిన స్థానాలు నూరు, సంస్థానాలకు సంబంధించిన స్థానాలు ఇరవైరెండూ ఖాళీ అయినవి. ఈ స్థానాలకు జరిగే ఉపఎన్నికలు జనవరి 15 వ తేదీలోగా పూర్తికాగలవనీ, ఉపఎన్నికల విధానాన్ని రాజ్యాంగపరిషదధ్యక్షుడు ఒకటి రెండు రోజుల్లో రాష్ట్ర, సంస్థానప్రభుత్వాలకు పంపుతాడనీ తెలియవచ్చినది.

ఉపఎన్నికలు వెనుకటిపద్ధతిలోనే రాష్ట్రసంస్థాన శాసనసభలు ప్రతినిధులను ఎన్నుకుంటారు. అయితే ఏకైకవ తమ వోటి సభ్యులనుమాత్రం ఎన్నుకోరు రాజస్థాన్‌లో శాసనసభలేదు. కనుక, ద్వంద్వ సభ్యత్వంవున్న హీరాలాల్ శాస్త్రి ప్రధాని స్థానంలో మరొకరిని రాజప్రముఖ్ నియమిస్తాడు.

ఈ ఉప ఎన్నికలలో సాధారణ స్థానాల అభ్యర్థులనూ, ముస్లిం అభ్యర్థులనూ విడివిడిగా ఎన్నుకునేపద్ధతి రద్దుఅవుతుంది. దామాషావారీ ప్రాతినిధ్యం అంటూ వుండదు. ప్రతిరాష్ట్ర శాసనసభ తాను 1946 లో పంపిన సభ్యులందరికి బదులు కొత్తవారిని ఎన్నుకోవలసి ఉంటుంది ఎన్ని స్థానాలు నింపవలసి ఉంటుందో అన్ని వోట్లు ఒక్కొక్క శాసనసభ్యుడికి ఉండగలవు. ఒక్కొక్క అభ్యర్థికి ఒక్కొక్క వోటు కన్నా ఎక్కువ ఇవ్వటానికి వీలులేదు.

విడి విడిగా నియోజకవర్గాలు ఉండవు కాని ముస్లిములకూ, నిమ్నజాతులకూ స్థానాలను ప్రత్యేకించటం ఉంటుంది.

శాసనసభ సమావేశం జరుగుతూఉంటే ఎన్నికలు సమావేశంలోనే జరుగుతవి. సమావేశం లేకపోతే పోస్టుద్వారానే జరుగుతవి రాజస్థాన్‌లో మినహా అన్ని చోట్లా శాసనసభ లున్నవి. పాటియాలా, తూర్పు పంజాబ్ సంస్థాన సమాఖ్య ప్రతినిధులు అనధికారులు కావటంవల్ల వారి స్థానాలు ఖాళీ కావు.

హైదరాబాద్‌కు ఇప్పుడు పార్లమెంటులో ప్రాతినిధ్యం లేదు. రిపబ్లిక్ అధ్యక్షుని ఎన్నిక అయినతరవాత అతడు హైదరాబాద్ ప్రాతినిధ్యానికి ప్రత్యేక ఏర్పాటు చేయగలడు.

కాశ్మీర్ సంస్థానానికి రాజ్యాంగంలో ప్రత్యేకస్థానం ఇవ్వబడ్డది. ద్వంద్వ సభ్యత్వం రద్దు కావాలన్న అంశం ఆ ప్రాంత ప్రతినిధులకు—షేక్ అబ్దుల్లా ప్రభృతులకు—అన్వయించదు. వారి స్థానాలు అందువల్ల ఖాళీ కావు.

## నగరంలో పంచదార కోటా పెంపకం

మదరాసు, డిశంబరు 12: నగరములో పంచదార రేషనును రెట్టింపు చేయవలెనని ప్రభుత్వము ఆలోచించుచున్నట్లు తెలియుచున్నది. ఈ సూచన ఆమోదింపబడినయెడల వచ్చేవారమునుండి అమలులోనికి రావచ్చును. నగరములో పంచదార పరిస్థితి చక్కబడి 9 వారములకు సరిపడే 13,000 బస్తాలు నిల్వయున్నందున ప్రభుత్వము రేషను ప్రమాణమును పెంచవలెనని ఆలోచించుచున్నది.

### గవర్నరుజనరలు రాక

మదరాసు, డిశంబరు 12: భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచార్యులుగారు డిసెంబరు 17 న ఉదయం 12 గంటలకుగాక 1-40కి విమానంలోక్కడం విమానాశ్రయం చేరెదరు.

## జనాభా లెక్కల తయారుకు ఏర్పాట్లు

### ఢిల్లీలో అధికారుల సమావేశం

న్యూఢిల్లీ, డిసెంబరు 12: 1951 లో జనాభా లెక్కలు తయారు చెయ్యడానికి కావలసిన మొట్టమొదటి ఏర్పాటులన్నీ పూర్తి అయిపోయాయట. ఈ కేంద్రరాష్ట్రాలలోను సంస్థానాలలోను ఉన్న జనాభా లెక్కల సూపరింటెండెంటులందరూ న్యూఢిల్లీలో నిన్నటి సెలాఖరునగాని, మార్చి ప్రారంభంలోగాని, సమావేశం కాగలరని తెలుస్తున్నది.

చరిత్రలో మొట్టమొదటగా భారత దేశంలోని ఇళ్ళన్నిటినీ లెక్కపెట్టడం జరగనున్నదట. ఈ విధంగా ప్రపంచం అంతటిలోను బాగా చదరయిన జనాభా లెక్కల పట్టికను తయారు చెయ్యడానికి వీలవుతుందట. మద్రాసు సి. పి. ఒరిస్సా, అస్సాం, రాష్ట్రాలలో ఇళ్లలెక్క పెట్టడం పూర్తి అయినదట. బొంబాయి, మధ్యభారత్ హిమాచల ప్రదేశ్, ఢిల్లీ రాష్ట్రాలలో ఈ ఇళ్ళలెక్క త్వరలోనే పూర్తి కాగలదట. మిగిలిన ప్రదేశాలలో ఈపని క్రమక్రమంగా జరుగుతున్నదని తెలుస్తున్నది.

ఇళ్ళసంఖ్య ఖచ్చితంగా ఉండేటట్లు ఏర్పాటు చేస్తారనీ, దీనివల్ల జనాభా లెక్కలు తయారు చెయ్యడం చాలా తేలిక కాగలదనీ తెలుస్తున్నది. ఈ లెక్కలు తయారు చెయ్యడంలో నమ్మదగిన పాదుపుగా వాడతారట. మొత్తం జనాభా లెక్కలు కన్నిటికీ 15 లక్షలు మాత్రమే ఖర్చుపెడతారట.

రాష్ట్రాలలోగాని, సంస్థానాలలోగాని ఉండే ఉద్యోగులను జనాభా లెక్కల గణకులుగా నియమిస్తారట.

జనాభా లెక్కలు తయారు చెయ్యడానికి కావలసిన ఫారాలప్పుడే పూర్తికావస్తున్నవట. ఇవి 1941 వ సంవత్సరం నాటి ఫారాలకంటె కొంచెం చిన్నవిగా ఉంటాయి. వచ్చే జనాభా లెక్కలకు 850 టన్నుల కాగితం కావాలట. అలీగర్‌లోని గవర్నమెంటు రోటరీ ప్రెస్సులో ఈ ఫారాలు అచ్చవుతాయట ఈ ముద్రణాలయం సంవత్సరానికి 4 వందల టన్నుల కాగితం ముద్రించగలదట.

కావలసిన ఫారాలలో సగం అప్పుడే అచ్చయిపోయాయి. కేంద్ర ప్రభుత్వం కొన్ని రాష్ట్రాలకప్పుడే కావలసిన ఫారాలు పంపించి వేసిందట.

రాష్ట్రాలలో జనాభా లెక్కల సూపరింటెండెంట్లను ఏర్పాటు చెయ్యడం అప్పుడే జరిగిపోయిందనీ, వీరు ముందు సంవత్సరం ప్రారంభం నించి పని చెయ్యగలరనీ తెలుస్తున్నది. జనాభా లెక్కల రిజిష్ట్రారు ఆర్. ఎ. గోపాలస్వామి, గత నవంబరు నించే తమ ఉద్యోగంలో పనిచేస్తున్నారనీ తెలుస్తున్నది.

## చంద్రనగర్‌నుండి పశ్చిమ బెంగాల్‌పై దాడులు

కలకత్తా, డిశంబరు 12: హుగ్లీ జిల్లాలో చంద్రనగర్ సరిహద్దునవున్న ఒక పోలీసు స్టేషనుపై 100 మందిదాడిచేసి, అచ్చటి పోలీసులను గాయపరిచిరనీ, వల్లలుదుర్కొనుచున్నను వానిని పాడుచేసిరనీ వార్తలందు తెలియుచున్నది. ఈ అకార్యము చేసినవారు చంద్రనగరు లోనికి పారిపోయిరి! ఈ సంఘటన సందర్భమున చంద్రనగర్ పరిపాలన సంఘాధ్యక్షుడు శ్రీ దేవన్ సేను గారును- చంద్రనగర్ పోలీసు కమిషనరు నేడు హుగ్లీ జిల్లా మేజిస్ట్రేటును కలిసికొనిరి.

చంద్రనగరను సరిహద్దు నుండగిందును పశ్చిమ బెంగాలు భూభాగములో దాడులు జరపకుండా చేయుటకు నైకొనవలసినచర్యల విషయమై శ్రీ దేవన్‌సేను జిల్లా మేజిస్ట్రేటుతో చర్చించెనని తెలియుచున్నది. నిన్నటిదాడి సందర్భమున హుగ్లీ పోలీసులు నేడు యిద్దరిని అరెస్టు చేసిరి.

## నెహ్రూతో అమెరికా సహాయమంత్రి గోష్ఠి

న్యూఢిల్లీ, డిశంబర్ 12: అమెరికా విదేశాంగశాఖ ఉపప్రధాని జార్జిమాక్‌ఘీ ఈవేళ ప్రధాని నెహ్రూను కలుసుకొని మాట్లాడారు. ఆయనతోపాటు అమెరికా రాయబారి లాయ్ హెండర్‌సన్ కూడా వున్నారు. అనంతరం మాక్‌ఘీ పారిశ్రామికమంత్రి శ్యామప్రసాద్ ముఖర్జీనికూడా చూచారు.

## దేశంలో చక్కెర అధికోత్పత్తి

న్యూఢిల్లీ, డిశంబర్ 14: దేశంలో వున్న 134 పంచదార మిల్లులు మింజుమలె, 77 మిల్లులు పని ప్రారంభించినై. నిరుటు ఈ తరుణానికి 58 మిల్లులకంటే పని ప్రారంభించలేదు.

## తుపాను నిధికై శ్రీమతి సూర్యకుమారి పాటకచేరీలు

ఆంధ్ర తుపానునిధికై శ్రీమతి టంగుటూరి సూర్యకుమారిగారి పాటకచేరీలు కలకత్తాలో యీనెల 18 వ తేదీన, జంషెడ్పూరు (టాటానగరు) నందు 20 తేదీన, ఖర్గపురమునందు 24 వ తేదీన ఆయాచోట్ల సహాయ సంఘములవారు ఏర్పాటుచేసిరి. కలకత్తా కచేరికి బెంగాలు గవర్నరుగారు కూడ హాజరగుదురు.

శ్రీ బుద్దవరపు రంగారావుగారు, ఆవడి ఇంజనీరింగు స్టోర్సు డిపో వర్కర్సు కమిటీ కార్యదర్శి, తుపానునిధికి ప్రజలంతా విరివిగా చందాలివ్వాలని కోరుచు విన్నపం ప్రకటించిరి.

ఆంధ్రకళామండలివారు, ఎం. ఎస్. ఎం. రైల్వే ఉద్యోగులయందు వసూలు చేసిన రూ 576-9-3 గవర్నరుగారి తుపాను సహాయనిధికి పంపిరి.

### బాధితుల సహాయార్థమై విజయవాడలో నాటకము

విజయవాడ, డిశంబరు 11 : కృష్ణావరద, తుపాను బాధితుల సహాయసంఘమువారి కోర్కెపై జవహర్ టాకీసులో నిన్న రాత్రి రాజరాజేశ్వరి నాట్యమండలివారు "ప్రసన్న యాదవ" నాటకమును ప్రదర్శించిరి దాదాపు 8000 రూపాయలు వసూలయినట్లు సహాయసంఘ అధ్యక్షులు ఆచార్య దేవర కాశేశ్వరరావుగారు నాటకమధ్యములో ప్రకటించి, టిక్కట్లు కొనివచ్చినవారికి, జవహర్ టాకీస్ వారికి, నాట్యమండలి వారికి కృతజ్ఞత తెల్పిరి ఆచార్య రంగా, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగార్లు, తుపాను, వరదలవలనబాధపడిన వారికి ఔదార్యములో సహాయము చేయుచున్నవారిని అభినందించిరి. (స్వ. వి.)

### తుపాను బాధితుల నిధిసహాయార్థం నెల్లూరులో సంగీత ప్రదర్శనం

చెన్నపట్నం, డిసెంబర్ 12 : ఆంధ్ర తుపాను బాధితులనిధి సహాయార్థ నెల్లూరులో అపరేటివు బ్యాంకి హాలులో డిసెంబరు 16 వ తేదీ శుక్రవారం సాయంత్రం 6 గం. సంగీతమణి మనక్కాల్ వరదరాజన్ సంగీత ప్రదర్శనమొసగెదరు శనివారం 17 వ తేదీ సా. 6 గం. అదేస్థలములో మిస్ యన్. లక్ష్మీబృందము సంగీతకచ్చేరి జరుగును.

## మదనపల్లికి మంత్రి రావ్ విక్టోరియా రాక

మదనపల్లి, డిసెంబరు 10: మద్రాసు ప్రభుత్వ ఆహారశాఖామంత్రి రావ్ విక్టోరియాగారు నిన్న సాయంత్రం చిత్తూరు నుండి యిచ్చటికి విచ్చేసిరి. వీరివెంబడి ప్రభుత్వ మత్స్యశాఖ డైరక్టర్, ఈ ఫిర్కా శాసనసభ్యుడు ఆర్. సాధమునిరెడ్డిగారు, జిల్లా సరఫరా అధికారి మొదలగువారు విచ్చేసిరి. పురప్రముఖులు, కాంగ్రెస్ నాయకులు ఈ గ్రామములో మూడు నెలలనుండి చాలా మట్టరకపు బియ్యము సరఫరా చేయుచుండుటను గూర్చియు, యిందువలన ప్రజలకు కలుగుచున్న ఇబ్బందులను గూర్చి వివరిస్తూ వినతిపత్రమును మంత్రిగారికి అందజేసిరి. ఈ గ్రామమునకు విద్యుచ్ఛక్తి త్వరగా ప్రవేశపెట్టవలసినదనీ ఈ ప్రాంతీయులకు ఉప్పుడు బియ్యము వాడుక లేనందువలన అది అపుడప్పు చేయవలెనని, విన్నవించిరి. మంత్రిగారు ఈ విషయములగూర్చి తగు శ్రద్ధ వహించెదమని తెలియజేసిరి.

ఈ దినం ఉదయం మంత్రిగారు క్షయరోగ ఆస్పత్రి, ఆరోగ్యకేంద్రం సందర్శించిన పిమ్మట అనంతపురమునకు వెళ్లిరి.

## తెలగ మహాజనసంఘ కార్యవర్గ సమావేశం

గుంటూరు, డిశంబరు 5 : ఈ నెల 4 వ తేదీన గుంటూరు అరండల్ పేట యందుగల సర్ కె. వి. రెడ్డినాయుడు తెలగ హాస్టలు భవనమందు, గుంటూరుజిల్లా తెలగమహాజనసంఘ కార్యవర్గము; తోట చెన్నకేశవయ్యనాయుడుగారి అధ్యక్షతన సమావేశమైనది.

ఈ సంఘమునకు పేదుమాసములకు షుమారు తొమ్మిదివేలరూపాయిలు ఆదాయము, తొమ్మిదివేల రూపాయిలు ఖర్చు కాగా, సభవారు దానిని ఆమోదించిరి.

సర్ కూర్మా హాస్టలు విద్యార్థులభోజన వసతులు నిమిత్తము మెంబరుగారు పెంకులతో ఒక షెడ్డును కట్టుటకు తీర్మానించిరి.

హాస్టలు విద్యార్థులకు దుర్వాసన కొట్టుచూ చాలా అనారోగ్యము కలుగజేయుచున్న, పిచ్చికల గుంటగుండు గల అనగా హాస్టలు సమీపములోనున్న మ్యునిసిపాలిటీ మరుగుదొడ్డినీ, మలమును నిల్వ చేయుచోటును, అక్కడనుండి మార్పు ఏర్పాటు చేయుటకుగాను, గుంటూరు చైరుమన్ గారికి, కలెక్టరుగారికి పిటీషను మూలముగా తెలియజేయుటకు ఒకతీర్మానము, కొన్ని యితర ముఖ్యతీర్మానములు చేసిన పిమ్మట సభ రాత్రి 9 గంటలకు ముగిసెను.

# సంగ్రహ వార్తలు

### ఎర్రావారిపాళెం

చిత్తూరుజిల్లా ఎర్రావారిపాళెం ఫిర్కా రైతుకాంగ్రెస్ వర్కర్లు శ్రీ పి. వి. మునిరెడ్డిగారి అధ్యక్షతన సమావేశమైనారు. ఆం. రా. కాంగ్రెస్ ఉపాధ్యక్షులు పి. తిర్మాలరెడ్డిగారు రైతుసమస్యలు, కాంగ్రెస్ సంస్థను, గురించి ఉపన్యసించిరి ప్రభుత్వముకిస్తు శెవి పద్ధతిని విరమిస్తు తీర్మానించిరి. కంట్రోళ్ళు తీసివేయవలెనని కూడా తీర్మానించిరి.

### అనకాపల్లి

ఈనెల 4 వ తేదీని శ్రీ గాంధీ ఆశ్రమమందు శారదా గ్రంథాలయ ఉచిత హిందీ పాఠశాల విద్యార్థుల సమావేశము గ్రంథాలయ, హిందీ ప్రేమీమండలుల అధ్యక్షులగు ఉప్పల శ్రీరామమూర్తిగారి అధ్యక్షతను జరిగినది హిందీవిద్యార్థుల బాధ్యతలగూర్చి పలువురు ఉపన్యసించారు. అల్పాహార విందులోను, వందనములతోను కార్యక్రమము ముగిసినది.

ఆరోజునే స్థానిక శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానమందు శ్రీమతి ఈటూరి లక్ష్మీకాంతమ్మగారు "సనాతన ధర్మము" అను విషయముపై మృదుమధురముగ ఉపన్యసించారు. కొన్నివందలమంది సభకు వచ్చారు. పండితులు, పామరులుకూడ ఆమె ఉపన్యాసమును ప్రశంసించి ఆనందించారు.

### పామర్రు

పామర్రు బోర్డుహైస్కూలులో డిశంబరు 4 వ తేదీ బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి అధ్యక్షతక్రింద గుడివాడ తాలూకా ఉపాధ్యాయ పండిత ప్రథమ మహాసభ జరిగినది సమావేశక ర్తయగు కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు పూలమాలచే శాస్త్రిగారి నలంకృతులుగాజేసి వారి భాషాసేవ నగ్గడించిరి. శ్రీ అక్కిపెద్ది భావనారాయణగారు (రాష్ట్ర పరిషత్కార్యదర్శి) యును చతుర్వేదుల సూర్యనారాయణశర్మగారి లేఖ చదివిరి. రాష్ట్రపరిషత్తు చరిత్రను శాస్త్రిగారు వివరముగా తెలియజేసిరి. తాలూకా ఉపాధ్యాయ పండిత పరిషత్తుల యావశ్యకతనుగూర్చి దుర్గా మల్లికార్జున రావుగారు ఉపన్యసించిరి.

### మురపాక

విశాఖపట్నం జిల్లా, చీపురుపల్లి తాలూకా మురపాక గ్రామంలో ఈనెల 1 వ తేదీని విజయనగరం పోస్టల్ యిన్స్పెక్టరువారు బ్రాంచి పోస్టాఫీసును గ్రామస్థుల సహకృతమున స్థాపించినారు. పోస్టుమాస్టరుగా గుంట్కు సూర్యదాసు గారిని నియమించినారు.

### వాల్తేరు

ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర భాషా సమితి యాజమాన్యమున 3 వ తేదీ సాయంకాలము విజయవాడ కళాశాలోపన్యాసకులైన జటావల్లభుల పురుషోత్తం (ఎం. ఏ.) గారు "వేదస్వరూపము" అను విషయముపై ఉపన్యసించిరి. యూనివర్సిటీలోని వేదాంత శాఖకు చెందిన కొల్లూరి సోమశేఖర శాస్త్రి గారధ్యక్షత వహించినారు. వేద పాఠపద్ధతి, వ్యాఖ్యానాదివ్యములు వేద శబ్దముల శక్తి, వేదములలోని సమాజనీతి, యజ్ఞములకు వేదములకు సంబంధము ప్రకృతి శాస్త్రములకు వేదములకు గల సంబంధము మున్నగు ననేక విషయములను గురించి శ్రీ పురుషోత్తముగా రుపన్యసించిరి. పరిషదధ్యక్షులు కూచిభొట్ల వారిగారు వందనము లర్పించుటతో సభముగిసెను.

### (శ్రీ) భీమవరం

స్థానిక హిందీ ప్రేమీమండలి, కళాశాల హిందీ సంఘం వారల అధ్వర్యాన స్థానికకళాశాలలో ఈ నెల 5 వ ప్రిన్సిపాల్ పెద్దాడ రామస్వామి గారధ్యక్షతన సభ జరిగినది.

రామస్వామి గారు మాట్లాడుచూ ఇంతవరకు ఆంగ్లమును రాజభాషగా ఏ విధముగా పఠించామో ఆ విధముగానే హిందీని కూడా గౌరవించాలని యువకులను ఉద్బోధించారు.

పలువురు హిందీ ఉపాధ్యాయులు, విద్యార్థులు హిందీ ప్రాముఖ్యతను గూర్చి ఉపన్యసించారు. హిందీ పరీక్షలలోను ఉత్తీర్ణులైన వారికి యోగ్యతా పత్రములు బహుమతులు అధ్యక్షులు పంచి పెట్టారు. పి. ఎస్. రాజాగారి వందనములతో సభ ముగిసెను.

### వెంకటగిరి

5-12-49 తేదీ వెంకటగిరి తాలూకా అత్తివరం ఫిర్కా వ్యవసాయ కూలీలసభ కుందాం గ్రామములో చీర్ల గురునాథంగారి అధ్యక్షతన జరిగెను. సభకు 38 గ్రామాలనుండి 1500 మంది ప్రతినిధులు వచ్చిరి కుందాం గ్రామస్థులు ఎద్దుల పిచ్చిరెడ్డిగారు, వెంకటరెడ్డిగారు వచ్చిన ప్రతినిధుల కందరికి అన్నదానము చేసిరి.

### హిందూపురము

రాయలసీమయందు అతురాస్వతాధినశక్తి "రాయలసీమ వనోజన విద్యా ప్రచార సంఘము" స్థాపింపబడినది. దీనికి కె. సుబ్బరావుగారు అధ్యక్షులుగను ఎం. సీతారామశాస్త్రిగారు ఉపాధ్యక్షులుగను, యన్. శ్రీ వెంకటేశ్గారిని ప్రధాన కార్యదర్శిగనూ ఎన్నుకొనిరి. "వనోజన విద్య" యను పేర ప్రచారమునకై ప్రచురణలు ఆరంభించుటకును, త్వరలో దానిని మాసపత్రికగా ప్రకటించుటకును తీర్మానించిరి.

### శ్రీకాకుళం

8-12-49 తేదీని ఆముదాలవలసలో పాలేటి గురువులు, ఎం.ఎల్.ఏ. గారి అధ్యక్షతను ఈ విశాఖజిల్లా హరిజనవర్కర్ల సమావేశం జరిగినది.

రా॥ కా॥ సభ్యులు కొత్తపల్లి పున్నయ్యగారు, జిల్లాలోని హరిజన సేవకులు, ప్రభుత్వం చేయు విద్యా తదితర సౌకర్యములు, పరిశుభ్రత, సంఘములోని కట్టుబాట్లు గురించి ఉపన్యసించిరి.

గురువులుగారు,కూడా యుపన్యసించిన తదుపరి వచ్చే జనవరి నెలలో ఉ॥వి॥ జిల్లా హరిజన మహాజనసభను జరుపుటకు తీర్మానించిరి.

## పత్తికొండ తాలూకాలో మలేరియా నివారణకృషి

పత్తికొండ, డిసెంబరు 6 : మలేరియా వ్యాధికి గురియై, క్రమేణా క్షీణించుచున్న పత్తికొండ తాలూకా గ్రామీణుల ఆరోగ్యమును పునరుద్ధరించుటకై, ప్రభుత్వమువారు తాలూకాలో 8 మలేరియా నివారణ కేంద్రాలను నెల కొల్పుతారని తెలుస్తున్నది. మొత్తము 45 గ్రామాలలో మలేరియా నివారణోద్యమము ప్రారంభింపబడుతుంది. పత్తికొండ, చిప్పగిరి, కరిపేముల గ్రామాలు నివారణ కేంద్రములుగ సూచించినట్లు తెలుస్తున్నది. మలేరియా నివారణోద్యమమునకై ఒక మలేరియా ఆరోగ్యాధికారి, 6 గురు మలేరియా మేస్త్రీలు నియమింపబడ్డారు. బాధిత ప్రదేశాలలో విరివిగా పాలుడ్రిన్, మెపాక్రిన్, క్వైనైను పంపకము, డి. డి. టిని విరజిమ్మటం, నివారణ సాధనాలుగ ఉపయోగిస్తారు. (స్వ. వి.)

## పశ్చిమ గోదావరి కాంగ్రెస్ వ్యవహారములు

విజయవాడ, డిశంబరు 11 : పశ్చిమ గోదావరి కాంగ్రెసు వ్యవహారములపై విచారణను చేయు ఒక ప్రత్యేక సంఘము వారు విజయవాడలో ప్రారంభింప వలసి ఉన్నప్పటికీ పశ్చిమ గోదావరి కాంగ్రెసువారు ప్రస్తుతము విజయవాడకువచ్చుటకు స్థానికమైన పని ఒత్తిడిచే వీలుకాదని తెల్పుటవలన, 18-12-49 నాడు విచారణ ఏలూరులోనే ప్రారంభమగునని తెలియుచున్నది. (స్వ. వి.)

## చీరాలలో చక్కెర పంపకం

చీరాల, డిశంబరు 6 : ఈ పూరి డిప్యూటీ తహశీల్దారు జనాబ్ మహమ్మద్ అజీం మొహిద్దీన్ సాహెబు గారు షుమారు 30 బస్తాల పంచదార స్థానిక వర్తకులచేత పరిమిట్ల మీద వీశె 1 కి రు 1-8-4 ల చొప్పున అమ్మించుచున్నారు. దానివల్ల ప్రజలలో పంచదార కరువు కొంతతగ్గినట్లు కనిపిస్తున్నది. ఈ పరిమిట్ల వల్ల, పంచదారకు బ్లాకుమార్కెట్టు ప్రస్తుతం అదృశ్యమైనది.

త్వరలో గోధుమలుకూడ సేరు 1 కి రు 0-6-4 చొప్పున డిపోలలో ఈవూరు డిప్యూటీ తహశీల్దారుగారు అమ్మించెదరని తెలియుచున్నది. ప్రస్తుతం గోధుమలు బ్లాకుమార్కెట్టులో సేరు 1 కి రు 0-15-0 అమ్ముతున్నారట. (స్వ. వి.)

## నేషనల్ సేవింగ్సు విధానము

చిత్తూరు, డిసెంబరు 8 : నిన్నటిదినం చిత్తూరు తాలూకాలో బొమ్మసముద్రం బోర్డుమిడిల్ స్కూలు హాలునందు సాయంత్రం 5 గం॥లకు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులైన ఆర్. వెంకటరెడ్డి (ఎమ్. ఎల్. ఎ.) గారి అధ్యక్షత క్రింద గొప్ప బహిరంగసభ జరిగెను. సభకు చుట్టుప్రక్కల నున్న పల్లెగ్రామముల నుంచి రైతులు, ఇతరులు హాజరైయుండిరి. సభ ప్రారంభము చేస్తూ జిల్లా నేషనల్ సేవింగ్సు ఆర్గనైజర్ గారైన పి. కొండారెడ్డిగారు నేషనల్ సేవింగ్సు స్కీము గురించి విపులముగా ప్రజలకు వివరించిరి. ఈ సందర్భమున ఎమ్. కుప్పిరెడ్డిగారు, ప్రజలు ఈ స్కీమును అమలు చేయుటలో ప్రభుత్వమువారికి తోడ్పడవలెనని ఉపన్యసించిరి. పిమ్మట అధ్యక్షుడు ఉపన్యసిస్తూ నేషనల్ సేవింగ్సు విధానము, ప్రజలకు ప్రభుత్వమునకు చాల ఉపయోగకారిగా నున్నదనియు గ్రామాభివృద్ధి కొరకు ప్రభుత్వము వారు తలపెట్టిన ప్రణాళికలో ఈ జవాబ్దారీని ప్రజలు గుర్తించి అది నెరవేర్పవలెననియు, హెచ్చరించిన పిమ్మట మునిరెడ్డిగారి వందనసమర్పణముతో సభ ముగిసెను.

## భారతీయులపట్ల సింహళ ప్రభుత్వ వైఖరి

### సింహళప్రభుత్వ పరిశ్రమలమంత్రి అభిప్రాయము

చెన్నపట్నం, డిశంబరు 12: సింహళములోని భారతీయులను బాధపెట్టవలెనని సింహళ ప్రభుత్వ విధానములో నొకభాగమేనని ఆరోపణకు యేమాత్రం గాని ఆధారము లేదని భారతీయులతో స్నేహ సంబంధములు కలిగియుండవలెననియే సింహళ ప్రభుత్వ ప్రధానికి చాలా ఆశయున్నదని మదరాసుకు వచ్చియున్న సింహళ పరిశ్రమల మంత్రి శ్రీ సి. జి. పొన్నంబలం గారు యీదినం ఇంటర్వ్యూయందు పత్రికా ప్రతినిధులతో చెప్పిరి.

ఆయన యీనాటి ఉదయం మదరాసు ప్రధానిని కలుసుకొని మాట్లాడిరి. మదరాసు ప్రభుత్వ పరిశ్రమల డైరెక్టరు ఫిషరీస్ డైరెక్టరు, డెవలప్మెంట్ శాఖ కార్యదర్శి మున్నగు వారితో సింహళ మంత్రి తన దేశములో తల పెట్టిన పారిశ్రామిక స్కీములను గూర్చి చర్చించిరి.

## కిరసనాయిలు చీకటి బజారులో అమ్మినందుకు రు 100/- జుల్మానా

ఏలూరు, డిసెంబరు 5 : కంట్రోలు రేటు డబ్బా 1 కి రు 5-4-0 కు బదులు డబ్బా 1 కి రు 7-0-0 చొ॥ ఒక డబ్బా కిరసనాయిలు అమ్మిన నేరమునకు, ఏలూరులో కిరసనాయిలు రిజిస్టర్డు డీలరగు మురికిపూడి సీతారామయ్యకు రు 100/- జుల్మానా, లేక 6 నెలల కఠినశిక్ష విధిస్తూ, ఏలూరు సబుడివిజనల్ మేజస్ట్రేటు ఎం. కరియప్పగారు నిన్న తీర్పు చెప్పారు. స్వ. వి.

## తూ. గో. కిసాన్ కాంగ్రెస్ సమావేశం

రాజమహేంద్రవరం, డిసెంబరు 7 : జమీందారీలరద్దు తర్వాత రైతుల స్థితిగతులెట్లున్నవి తెలిసికొనుటకై పర్యటించుచున్న ఆంధ్రరాష్ట్ర రైతు కాంగ్రెస్ అధ్యక్షులు గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు నిన్న యిచ్చటకు వచ్చిన సందర్భంలో యీ జిల్లా కిసాన్ కాంగ్రెస్ వారి సమావేశం జరుపబడింది. జిల్లాలోని అన్నిప్రాంతాలనుండి పెక్కుమంది రైతులు సమావేశానికి హాజరై తమ కష్టనష్టములను చెప్పకొనిరి. వెంకటసుబ్బయ్యగారు వారి యిక్కట్లు విని తగు సలహాలిచ్చిరి. నీరుకొండ వెంకటరామారావు, చల్లా అప్పారావు మున్నగువారుకూడ వెంకటసుబ్బయ్యగార్ని కలిసికొని రైతు సమస్యలపై ఇంటర్వ్యూ చేసిరి. (స్వ. వి.)

## యువజన కాంగ్రెస్ స్థాపన

రాజమండ్రి, డిశంబరు 6: ఇచ్చటి లక్ష్మీవారపుపేటలో యీనెల 4వ తేదీన కొందరు యువక కాంగ్రెస్ వాదులు యక్కల బసవరాజుగారి అధ్యక్షతను సమావేశమై యువజన కాంగ్రెస్ సంఘము స్థాపించిరి. దీనికి ఉప్పాడ సుబ్బారావుగారధ్యక్షులుగను, జలగం వీర్రాజు గారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి. పట్టణ కేంద్ర యువజన కాంగ్రెస్ కు యీ సంఘమును అనుబంధ సంస్థగా స్వీకరించవలసినదని కేంద్ర సంఘమును కోరుటకు తీర్మానించబడెను. (స్వ. వి.)

## భాస్కరశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము

ఆదోని, డిసెంబరు 6 : రాయలసీమలో ప్రఖ్యాతిగాంచిన జ్యోతిష కవి పండితులగు కావ్యభూషణ, ఆంధ్ర విద్యా వాచస్పతి జ్యోతిష స్థాపక సిద్ధాంతి లోగిశెట్టి భాస్కరశాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవము మొన్న గుత్తి తాలూకా రాగులపాడు గ్రామమున జరిగింది. మద్రాసు మంత్రి సీతారామరెడ్డిగారును డా. చిలుకూరి నారాయణరావుగారును, మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారును, ఇంకను పలువురు తమ సందేశాలను పంపిరి. శాస్త్రిగారి శిష్యులు మేదేహాళు రంగస్వామి శెట్టిగారు రూ 116/-లను,శాలువను బహూకరించిరి. గదేకల్లు యూరిద శీనప్పగారు 6 ఎకరములభూమిని దానముగా సమర్పించిరి. పత్యాసభకు బ్రహ్మాండ ప్రకాశకేత భూగోళకర్త కూడలి సుబ్రహ్మణ్య దివ్యజ్ఞాలుగారు అధ్యక్షత వహించియుండిరి

## తుళ్లూరు సంఘటన వార్త

నిడుముక్కల, డిశంబరు 12: తాడికొండ ఫిర్కా, తుళ్లూరుగ్రామంపై ఇటీవల కమ్యూనిస్టుదాడి జరిగినట్లు ప్రకటింపబడినవార్త సత్యం కాదనీ, ఆ ఘటనలో కమ్యూనిస్టుల ప్రసక్తియే లేదని దుర్గాపుర వాస్తవ్యులు శ్రీ మావపు మహేశ్వరరావుగారు తెలియజేస్తున్నారు.

**టెండరు నోటీసు**

**హైవేసు డిపార్టుమెంటు**

సీలువేసిన టెండర్లు హైవేసు అనంతపురం డివిజనల్ యింజనీయర్ గారిచే వారిఆఫీసునందు అనంతపురంలో 28-12-49 తేది మధ్యాహ్నము 4 గంటల వరకు జయమంగళి నదికి హిందూపురం, మడకశిరా రోడ్డులో 4 మైలు (అనగా 24/6-వ మైలు. కొడికొండ అమరాపురం రోడ్డులో) వరకు బండు కట్టుటకు గాను సీల్డు టెండర్లు తీసుకొనబడును.

(2) టెండరుయొక్క అంశములు, నిర్ణయించిన నమూనాలు, పెద్దూ లైరాలు డివిజనల్ ఇంజనీయరు ఆఫీసు మానేజరుగారిచే ఒక సెట్టుకు రూ 10-2-6 చొప్పున (వాపసు యివ్వబడదు) 1-12-49 నుండి 28-12-49 వరకు ఆఫీసు పనిచేయు దినములలో దరఖాస్తుద్వారా యివ్వబడును.

(3) డిపాజిట్టు మొత్తము రూ 1750/- టెండరుతో కట్టవలెను.

(సం) యస్. ధర్మరావు నాయుడు,
డివిజనల్ యింజనీయరు (హైవేసు)
అనంతపురం.

**టెండరు**

మద్రాసు, గవర్నమెంటు జనరల్ ఆస్పత్రి, ఔట్-పేషెంటు డిపార్టుమెంటు కాంపౌండులో సైకిల్ స్టాండును 1-4-1950 తేదినుండి 1950-51 సంవత్సరమునకు అద్దెకు తీసుకొనుటకు, ఉదయము 6 గంటలనుండి 8 గంటలవరకు అన్నిరోజులలోను, సైకిల్ 1-కి రు 0-0-6 చొప్పున రుసుము వసూలు చేసుకొను హక్కుకు, సీలుచేసిన టెండర్లు 8-1-1950 ఉదయము 11 గంటలవరకు తీసుకొనబడును. టెండర్ల మీద "Tender for the lease of Cycle Stand" అని వ్రాసి, మద్రాసు గవర్నమెంటు జనరల్ ఆస్పత్రి సూపరింటెండెంటు విలాసమునకు పంపవలెను. దిగువ సంతకముదారునుండి టెండరు వరతులు తెలిసికొనవచ్చును.

సంఘం లాల్,
రెసిడెంటు కల్నల్,
సూపరింటెండెంటు, గవర్నమెంటు
జనరల్ ఆస్పత్రి, మదరాసు

**టెండరు**

పొన్నూరు పంచాయితీ బోర్డు తాలూకు 1949-50 రోడ్ల మరమ్మతుపనులు చేయుటకు ఎస్టిమేటు దాఖలా మొత్తము రు 4,970/- పనులకు 20-12-49 తేది సాయంత్రము 4 గంటలవరకు సీలువేయబడిన టెండర్లు నిర్ణయించబడిన నమూనాలో యీ పంచాయితీ బోర్డులో రిజిస్టర్డు కంట్రాక్టర్ల వద్దనుండి యీ దిగువ సంతకముచేసిన అధికారిచే పొన్నూరు పంచాయితీ బోర్డు ఆఫీసువద్ద తీసుకొనబడును. నిర్ణయించబడిన టెండరు నమూనా ఫారములు రు 1-0-0 చెల్లించి తీసుకొనవచ్చును. ధరావతు ఎస్టిమేటులో నూటికి రు 3-0-0 చొప్పున చెల్లించవలెను. ఇతర టెండరు వరతులు, వివరములు, ఆఫీసు పనిచేయు రోజులలో ఉదయము 11 గంటలనుండి సాయంత్రము 5 గంటలవరకు పొందవచ్చును.

(సం) కె. దశరధరామయ్య, బి.ఏ.
కార్యనిర్వాహకోద్యోగి, పొన్నూరు.

**టెండరు నోటీసు**

క్రిందుమూలమున తెలియపరచునదేమనగా, 1-4-1950 నుండి 31-3-1951 తేదివరకు సూళ్లూరుపేట పంచాయితీ బోర్డు రోడ్లు వగైరాలకు చిమ్మించి రోడ్ల ప్రక్కని చెత్త చెదారములను శుభ్రంచుటకు టెండర్లు 29-12-49 తేది సాయంత్రము 5 గంటల వరకు సదరు పంచాయితీ బోర్డు ఆఫీసులో తీసుకొనబడును. యింగకు సంబంధించిన వివరములను ఆఫీసులో ఉదయం 11 మొదలు సా॥ 5 గంటలలోపల తెలుసుకొనవచ్చును.

N Venkatasubba Reddi,
10-12-49. Executive Officer,
Panchayat Board, Sulurpeta



## లక్షలాది కాందిశీకులకు భూవసతులు

### కాందిశీకశాఖ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 11: కాందిశీక మంత్రివర్గం ఈ దిగువ ప్రకటన చేస్తున్నది:

ఈ అక్టోబరు నెలాఖరుకు రాష్ట్ర సంస్థాన ప్రాంతాలలో, ప్రభుత్వ 2,76,000 కాందిశీకులకు భూవసతులు కల్పించింది. ఈ భూవసతులు పొందిన వారికి, వ్యవసాయఖర్చుల నిమిత్తం ప్రభుత్వం 2.6 కోట్ల రూపాయలు ఋణా లిచ్చింది.

పాటియాలా, తూర్పు పంజాబ్, తూర్పు పంజాబ్ సమాఖ్య ప్రాంతాలలో 9.44 లక్షల ఎకరాలు వారి కిచ్చాం. మార్వార్, అండమాన్ దీవులు, భోపాల్ బొంబాయి, మధ్య పరగణాలు, బీదార్ ఢిల్లీ, మధ్య భారతం, మైసూరు, రాజస్థాన్, సౌరాష్ట్ర, సంయుక్త రాష్ట్ర ప్రాంతాలలో 3 94 లక్షల యెకరాలు కేటాయించాం. 14 లక్షలమందికి గృహవసతులు చూపించాం. డిసెంబర్ నెలాఖరుకు మరో 25,000 యిళ్లు తయారవుతవి. మరో 19,000 గృహాలు ప్రారంభ దశలో వున్నయ్. ఇవి గాక కాందిశీకులు యిళ్ళు కట్టుకోవటానికి మరో 9000 యిళ్ళ జాగాలు యేర్పాటు చేశాం. వివిధ ప్రాంతాలలోనూ పాకిస్థాన్ వెళ్లిన కాందిశీకులు వదలి పెట్టి పోయిన 28,000 దుకాణాలు వీరికి ఒప్పగింత చేశాం. మరో 11,000 దుకాణాలు అదనంగానిర్మించాం. మరో 3800 దుకాణాల నిర్మాణం జరుగుతోంది. కాందిశీకులు స్వంతబాధ్యతమీద దుకాణాలు కట్టుకోవటానికి మరో 2,600 జాగాలు ఉచితంగా యివ్వటానికి యేర్పాట్లుచేశాం.

294 కేంద్రాలలో 6,700 కాందిశీకులు చేతివిద్య లభ్యసించుచున్నారు. ఇప్పటికి వివిధ కేంద్రాలలోనూ 12000 మంది విద్యార్థులు ఉత్తీర్ణులై వెళ్లారు.

ప్రభుత్వశాఖలలో 1,81,600 మందికి ఉద్యోగాలు చూపించాం.

వివిధ ప్రాంతాలలోను నడుపుతున్న అనాథ స్త్రీ శిశు కేంద్రాలలో 10,800 స్త్రీలూ, 6,000 మంది శిశువులూ వున్నారు.

వివిధ కాందిశీక కేంద్రాలలో నూ ఇంకా 6.96 లక్షలమంది వున్నారు, అయితే వీరిలో చాలామంది తమ జీవనభృతి తాము సంపాదించుకునే స్థితిలోకి వచ్చారు.

ఒక 3.09 లక్షలమందికి మాత్రం ప్రభుత్వం ఉచితభృతుల నివ్వవలసి వస్తున్నది

## అమెరికా సహాయ మంత్రి మాఫీ ఢిల్లీరాక

న్యూఢిల్లీ, డిసెంబరు 11: అమెరికా వైదేశికశాఖ సహాయమంత్రి జార్జి మాఫీ నేటి మధ్యాహ్నము పెషావరునుండి ఢిల్లీ వచ్చెను. అమెరికన్ రాయబారి లాయ్ హెండర్సన్, ఆతని కార్యాలయ సిబ్బంది, భారత వైదేశికశాఖ కార్యదర్శి శ్రీరామ దొయిల్ గారలు వెల్లింగ్టన్ విమానాశ్రయమునద్ద ఆయనకు స్వాగత మొసంగిరి.

అమెరికామంత్రి భారత మంత్రులను, అధికారులను కలిసికొనును. మద్రాసు, ఆగ్రా, కలకత్తాలకు వెళ్లును. భారతదేశ వైదేశికశాఖవారు ఆయనకు విందుచేయనున్నారు.

భారతదేశము విషయమై అమెరికా ప్రజల శ్రద్ధ హెచ్చినదని, పండిత నెహ్రూ అమెరికా పర్యటనము దిగ్విజయముగా జరిగినదని అమెరికా సహాయ మంత్రి చెప్పెను. నెహ్రూ అమెరికా పర్యటన సమయమున తానుగూడ ఆయనతో నుండెనని, తిరిగి ఆయనను ఇతర భారతమంత్రులను కలిసికొన ఆతురత జెందుచుండెనని ఆయన చెప్పెను.

## సింహళంలో వలస నిబంధనలు

కొలంబో, డిసెంబరు 10: సింహళంలో నవంబరు 1 నుంచి అమలులోకి వచ్చిన వసల నిబంధనలు విషయమై అక్కడి విదేశ వ్యవహారశాఖవారు ఈ క్రింది వివరాలు ప్రకటన చేశారు.

సింహళంలో ప్రవేశించే వారికి పాసుపోర్టు పర్మిటు లేక వీసా ఉండాలి భారతీయులు, మటుకు పాసు పోర్టులకు బదులు ఇండియా సింహళం పాసులు తీసుకురావచ్చును. వీటిని ఇండియాలోని జిల్లా మేజిస్ట్రేటులు గాని సింహళంలోని భారత హైకమిషనరు గాని ఇస్తారు. ఇండియా నుంచి వచ్చే యాత్రికులకు యీ తాత్కాలిక పత్రాలు లివ్వడానికి ఏర్పాట్లున్నవి. తొందరగా బయలుదేరవలసి వస్తే ఇండియా నుండి వచ్చే ప్రయాణీకులకు వీసా గాని పర్మిటు గాని అవసరం లేదు లోగడ సింహళంలో పనిచేసి ఉన్న కార్మికులు పాసుపోర్టు లేక దానికి రావచ్చు.

## "విద్యావిధానంలో శాస్త్రప్రావీణ్యం ప్రధాన విషయం"

### ఇండియా ప్రభుత్వ పబ్లికు శాఖామంత్రి హెచ్చరిక

నాగపూరు, డిసెంబరు 11: శ్రీ మధురదాస్ మెహతా సైన్సు కాలేజీ ఒకటి నాగపూరులో ఏర్పాటు చేయబడెను. ఇది నాగపూరు శిక్షణ మండలిచే నెలకొల్పబడెను. నాగపూరులోను, చుట్టుప్రక్కలను విద్యాశాలలను నెలకొల్పుటకై ఈ శిక్షణమండలి ఏర్పడినది యీ మండలికి భూరి విరాళము నొసంగిన మధురదాసు మెహతా గారి పేరుతో యీ సంస్థ వ్యవహరించుచున్నది. ఈ సైన్సు కాలేజీ ప్రారంభోత్సవమును జరుపుచు ఇండియా ప్రభుత్వ పబ్లికు వర్క్సు శాఖా మంత్రి గాడ్గిలుగారు ఇట్లు పన్యసించిరి.

సాంకేతికవిద్యకు, శాతికశాస్త్ర పఠనమునకు మన విద్యా విధానములో ఎక్కువ ప్రాధాన్యము నొసంగవలెను. ఈ సభకు మధ్యపరగణాల గవర్నరు మంగళదాసు పక్వాసా గారు అధ్యక్షత వహించిరి. సైన్సు కాలేజీలో గాంధి మహాత్ముని పటమును పక్వాసాగారు ఆవిష్కరణ మొనర్చిరి.

గాడ్గిలుగారు తమ ఉపన్యాసములో యీ క్రింది విషయములు నొక్కి వక్కాణించిరి. ఆత్మసంతుష్టితో అకలను త్రుంచి వేసికొని ప్రవర్తించవలెననే వేదాంతము నిష్ప్రయోజనమును బోధించెడి వేదాంతమై యున్నది. కాని, యీ కాలంలో మన ప్రస్తుత పరిస్థితులకు మనము అసంతృప్తి జెందుటవల్లనే పురోభివృద్ధి నందగలము. ప్రజల జీవనప్రమాణము వృద్ధిపొందవలెనంటే ఎక్కువ వస్తుసంపదను వృద్ధిచేయవలెను. ముడిపదార్థములు సమృద్ధిగాకలవు. కాని, మనకు అక్కరకువచ్చెడి వరకులను వానిలోనుంచి తయారుచేయుటకు శాస్త్ర ప్రవీణులు కావాలి. శాస్త్రజ్ఞానం వల్ల మారణ సాధనములు కూడా కనిపెట్టబడవచ్చును. కాని వాటిని కనిపెట్టుట శాస్త్రజ్ఞాని తప్పుకాదు. ఆ మారణ సాధనములను ప్రయోగించుట తప్పు. ఏదైనా వస్తువులను ఉత్పత్తి చేయుటయందు ధర్మ నియమము ఉండాలి. ఉత్పత్తిచేసిన వస్తుసామగ్రి ప్రజలకందరకు సమానంగా సరఫరా కావలెను.

మధ్యపరగణాల ప్రధానమంత్రి యగు రవిశంకర శుక్ల గారితో, పారిశ్రామిక శాఖా మంత్రి మెహతా గారితో శ్రీ గాడ్గిలు గారు కొన్ని విషయములు చర్చించిరి.

నాగపూరుకు 10 మైళ్లలో ఖపర్ఖేడావద్ద ధర్మల్ విద్యుదుత్పత్తి కేంద్రమును నిర్మించుచున్నారు. దీనిని గాడ్గిలుగారు సందర్శించి రేపు ఢిల్లీకి వెళ్ళెదరు.

## "మాకు కూడ ఒక ఏనుగ కావాలి"

### నెహ్రూకు విజ్ఞప్తిచేయ బెర్లిన్ పిల్లల నిర్ణయము

బెర్లిను, డిసెంబరు 11: విమానదాడుల వల్ల నష్టపడిన బెర్లిన్ జంతుప్రదర్శనశాలకు ఒక ఏనుగు పంపవలెనని భారత ప్రధాని పండిత నెహ్రూగారికి మహజరు పంప బెర్లిన్ బడిపిల్లల మహాసభవారు నేడు నిర్ణయించిరి. జపాను పిల్లల విజ్ఞప్తిని పురస్కరించుకొని పండితుడు గత సెప్టెంబరులో టోకియో జంతు ప్రదర్శనశాలకు 'ఇందిర'ను పంపిరని పాఠకులకు జ్ఞాపకముండును.

## ట్రిబుల్ టోట్ లో రు 25,834

### మదరాసు గుఱ్ఱపు పందెములలో మంచి డివిడెండ్లు

చెన్నపట్నం, డిసెంబరు 12: మదరాసు గుఱ్ఱపుపందెముల డిసెంబరు రెండవ మీటింగులో నిన్న పందెములపై పందెములు కట్టినగుఱ్ఱములు వారు అనుకొన్న ప్రకారం గెలువ లేదు. ఒక బోల్డుబాబ్ తప్ప పందెములు గెలిచిన గుఱ్ఱాలు చాలావరకు వారికి ఆశాభంగము కలిగించెను. మూడుగుఱ్ఱాలు రాయల్ ఎక్స్ప్రెస్ రూ 146 టాప్ డాన్స రూ 146 మంచెఫ్ రూ 135 వరకు ఎక్కువ మొత్తాల డివిడెండు లొసగినవి. ట్రిబుల్ టోట్ లో అదృష్టము చేసిన ఒకవ్యక్తి రు 25,834 బహుమతి పొందగల్గెను.

డబిల్ టోట్ లో 11 మంది తలాక రూ 1425 బహుమతి.

ముత్యాలపేటలో ఎ. ఆర్. సి స్కూలు కరెస్పాండెంటుగనున్న కె. రామస్వామిశెట్టిగారి 50 జన్మదినోత్సవము నా॥ వల్లూరి ఎస్. కృష్ణస్వామినాయుడుగారి అధ్యక్షత న జరిగెను. వారు విద్యావ్యాప్తికై చేసిన కృషి కొనియాడుచు, టి. సంతాన కృష్ణ నాయుడు, కె. వెంకటస్వామి నాయుడు, సుందర వరదాచారిగార్లు మున్నగువారు ప్రసంగించిరి.

## ఆహార కంట్రోలు నేరాలు-శిక్షలు

చెన్నరాష్ట్రమునందు నవంబరు 15 తో అంతమయ్యే పక్షమునందు చెన్నరాష్ట్రంలో చెంగల్పట్టు, తూ. గోదావరి, ద. ఆర్కాటులు మినహా మిగిలిన జిల్లాలందు మొత్తం 584 ఆహారకంట్రోలు నేరాలు విచారించబడెను. విశాఖ జిల్లా 1, కర్నూలు 1, నీలగిరి 3, చిత్తూరు 5, బళ్ళారి 6, ప. గోదావరి 9, మలబారు 9, అనంతపూరు 12, నెల్లూరు 13, 15 కడప, 24 మధుర, ఉ. కనరా 5, ఉ. ఆర్కాడు 26, కోయంబత్తూరు 58, టిన్నవెల్లి 28, మదరాసు 35, రామ్నాడు 52, తంజావూరు 36, గుంటూరు 59 తిరుచునాపల్లి 66, సేలం 181

369 కేసులలో రూ. 1 నుండి 49 వరకు జరిమానాలు విధించబడెను. 44 కేసులలో రూ 100 నుండి 200 వరకు, 18 కేసులలో 200-500 వరకు, ఒకరికి రూ 1000 జరిమానా విధించబడెను. 40మందికి ఖైదు శిక్షవిధించబడెను. 64గురు విడుదల చేయబడిరి ఇతరులు 218మందికి హెచ్చరికలు, ధరావత్తులు ఎక్కువ కోరుట, లైసెన్సు రద్దుచేయుట జరిగెను.

## ఉద్యోగులకు యిచ్చిన ప్రశ్నావళి

చెన్నపట్నం, డిసెంబరు 12: మదరాసు ప్రభుత్వంవారు ఆయా శాఖాధిపతులకు ఆయా శాఖలలో ఆంధ్రులైనవారు యెందరు ఉన్నదీ, వారి హోదాలు, వారు పుట్టినజిల్లా తెలుపవలసిందిగను, ఆంధ్రేతరులైనవారు ఆంధ్రరాష్ట్రమునకు కంట్రాక్టు పద్ధతిపై ఎందరు వెళ్ళ సిద్ధముగా ఉన్నదియును తెలుసుకొనవలసిందిగను కోరినారని తెలియుచున్నది.

## డాక్యుమెంటరీ ఫిల్ములు

మదరాసు డిసెం 12: జనవరి 26వ తేదీన భారతదేశ నూతన రాజ్యాంగం ప్రారంభమగు నాడు, ఇండియాప్రభుత్వం ఫిల్ముల శాఖ వారు నూతన రాజ్యాంగవిధానమునందలి ముఖ్యాంశములను తెలుపు ఫిల్ము నొకటి విడుదల చేయదలచిరి. ఆనాడే కాశ్మీరునుగూర్చి కూడ ఒకరంగుల ఫిల్ము విడుదల చేయుదురు. మదరాసు ఫిల్ముల శాఖవారు నేడు పత్రికా ప్రతినిధులకు "జన్మనిగ్రహం" గాంధిజీ దృశ్యాలు, ధనవృత్తం అనుఫిల్ములు చూపినపుడు, పైవిషయం తెలుపబడెను. వీరు ప్రదర్శించిన క్రొత్త న్యూసురీలులో రాజ్యాంగచట్టం పరిషత్తులో సంతకములగుట, బొంబాయిలో చేనుబాలు ఆటగాళ్ళు

## అడ్వొకేటులుగా 81మంది ప్లీడర్లు నమోదు

చెన్నపట్నం డిసెంబరు 12: చెన్నరాజధాని లోని పలుజిల్లాలనుండి 81 మంది ఫస్టుగ్రేడు ప్లీడర్లు యీవాళ మదరాసు హైకోర్టులో ప్రధాన న్యా॥ రాజమన్నార్, న్యా॥ సత్యనారాయణరావు న్యా॥ విశ్వనాథశాస్త్రిగార్ల ఎదుట అడ్వకేట్లుగా దాఖలైనారు.

## క్రొత్తబడి

సైదాపేటలో కార్పొరేషను ముస్లిము బాలికా పాఠశాల ప్రారంభోత్సవము సర్ మహమ్మదు ఉస్మానుగారు సోమవారం ఉదయం జరిపిరి. మేయరు డా॥ పి. వి. చెరియనుగారు అధ్యక్షత వహించిరి.

## బ్రాహ్మణుల సభ

రణదేహోలులో ఎం. ఎస్. సుబ్రహ్మణ్యయ్యరు గారి అధ్యక్షతను జరిగిన ప్రోగ్రెసివ్ బ్రాహ్మణుల సభయందు, ప్రభుత్వం వారు కమ్యూనల్ జి. ఓ. తొలగించి, జాతికుల, తరగతి భేదములులేని సంఘం స్థాపించుటకు తోడ్పడవలెనని తీర్మానించబడెను. ఎ. ఆర్. వి. ఆచారి, కర్నలు టి. ఎస్. శాస్త్రి మున్నగువారు సభలో పాల్గొనిరి.

## ఫిర్కా అభివృద్ధి కట్టడములు వగైరా నిర్వహణ

మదరాసు, డిసెంబరు 12: ఫిర్కా అభివృద్ధికార్యక్రమముక్రింద నిర్మించిన పాఠశాలభవనములు స్నానపుగదులు, చంతశాలలు, మురుగుకాల్వలు, పాయిఖానాలు వగైరాల నిర్వహణ బాధ్యతను స్థానిక సంస్థలు వహించవలెనని ప్రభుత్వము ఉత్తర్వుచేసెను.

## ఉద్యోగ వార్తలు

మదరాసు, డిసెంబరు 12. సేలంజిల్లా కలెక్టరు శ్రీ యస్ ఆర్ కైనార్ పబ్లిక్ డిపార్టుమెంటు డిప్యూటీ కార్యదర్శిగా శ్రీ సి. యస్. రామచంద్రన్ ఐ సి ఎస్. కు బదులు నియమించబడిరి

శ్రీ సి యస్. రామచంద్రన్ పబ్లిక్ డిపార్టుమెంటు అడిషనల్ డిప్యూటీ సెక్రటరీగా నియమించబడిరి



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.